17-4-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి :63 సంచిక :16 విడిప్రతి : రు. 1.50 లు

Regd. No. H.N.L. 18

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



కళాత్మకంగా నిర్మించిన స్వాగత ద్వారాలలో ఒకటి

## ప్రధానితో సహా అందరిని పరవశుల్ని చేసిన

# జనార్ధన మాయాజాలం!

తిరుపతి ప్లీనరీ జరిగిన తీరు వర్ణించడానికి మాటలు చాలవు. బ్రహ్మాండం, ఘనం, అద్భుతం, పరమాద్భుతం వంటి పదాలేవీ ప్లీనరీ ఉపమానాలకు సరిపోవు. నూట ఏడేళ్ళ కాంగ్రెస్ చరిత్రలో సువర్ణాక్షర లిఖిత ఘట్టంగా నిల్చిపోయే మహత్తర మహాసభల పర్వమిది. ఈ మూడు రోజులూ తిరుపతిలో గడిపిన కాంగ్రెస్ వారి ఎవరూ తమ జీవిత కాలంలో మర్చిపోలేని మధురానుభూతిని మిగిల్చింది ప్లీనరీ!

సమావేశాలు జరిగిన తీరూ ప్రశంసనీయమైనదే! కాంగ్రెస్ వాదులలో కలికానికి కూడా కన్పించని క్రమశిక్షణ ఈ సమావేశాలలో ప్రతిఫలించడం ఆశ్చర్య పడాల్సిన విషయం. 23 రాష్ట్రాల నుంచి, 10 దేశాల నుంచి దాదాపు మూడు వేల మంది ప్రతినిధులు, మంత్రులు, రాష్ట్ర నాయకులు విచ్చేసినా – దాదాపు 30 వేల మంది ఛోటా బడా నాయకులు గుమికూడిన సమావేశాలు చిన్న అంతరాయం లేకుండా జరిగాయి. బ్లాక్ కాట్ కమెండోల రక్షణలో బ్రతికే భగత్, భజన్‌లాల్ వంటి నలుగు రైదుగురు తప్ప, తక్కిన కేంద్ర మంత్రులు, రాష్ట్ర నాయకులు సాదా సీదా కార్యకర్తలవలె ప్రవర్తించారు. మన్‌మోహన్‌సింగ్ అర్జున్ సింగ్, గులాం నబి ఆజాద్,

### తిరుపతి కాంగ్రెస్ విశేషాలు

చింతామోహన్ తదితర నాయకులు జనంలో కలిసిపోయారు. వారి ప్రక్కన కనీసం బాడీ గార్డు కూడా లేరు. ఏఐసిసి ఆఫీసు ఎదురుగా ఆరు బయట ఇసుకలో బలరాం జక్కర్. పెద్ద రైతు మాదిరి చతికిలబడి కూర్చోమందడం కన్పించింది. మన్‌మోహన్ సింగ్ అయితే చేతిలో కాగితాల కట్ట పట్టుకొని, పంజాబ్ నుంచి వచ్చిన సాధారణ ప్రతినిధి మాదిరి తిరుగుతుండినారు.

ప్రధాని శ్రీ పి.వి. 14 నుంచి 16 తేది సాయంత్రం వరకు వేదిక దిగితే ఒట్టు. పద్మాసనం వేసుకొని గంటల తరబడి అట్లే కూర్చుండిపోయి, ప్రతి ఉపన్యాసాన్ని శ్రద్ధగా ఆలంకించారు. మధ్యమధ్యలో అయ్యవారు ఫారం చెప్పినట్లు ఉపన్యాసాలు చేశారు. ఇటు ప్రతినిధులు కాని, అటు నాయకులు కాని పివి మాట జవదాటి లేదు.



హంసరూపంలో అలంకృతమైన ప్రధాని బుల్లెట్ ప్రూఫ్ కారు

అయితే రాజీవ్ గాంధీ లేని లోటు మాత్రం సమావేశాలలో కొట్టొచ్చినట్లు కన్పించింది. క్రమబద్ధంగా చేసిన ఏర్పాట్లలో క్రమశిక్షణ తప్పి ప్రవర్తించడానికి అవకాశం రాలేదనే కాని – వేదిక పై వున్న నాయకుల పట్ల ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీల కాలం నాటి సమ్మోహనత్వం మచ్చుకు కూడా కన్పించలేదు. ఆ జనాన్ని మంత్ర ముగ్ధులను చేసే వశీకరణ విద్య ఏ నాయకుడిలోనూ లేదు, ఉపన్యాసాలకు చప్పట్లు, కేరింతలు అసలే లేవు. ఆయా నాయకులు మాట్లాడేటప్పుడు వారి వారి అనుచరులు ఎక్కడో ఒక చోట గుంపుగా చేరి నినాదాలు వేయడం తప్ప, మొత్తం ప్రతినిధులను చైతన్యవంతులను చేసిన ఉపన్యాసాలు లేవు.

తిరుపతి ఎండలు వచ్చిన ప్రతినిధుల ఊపిరి తీశాయి. ప్లీనరీ జరిగే ప్రధాన సమావేశ మందిరంలో తప్ప ఇంకెక్కడకు పోయినా ఛాక్కాలు ముద్దముద్దే! తలబైట పెడితే నడ్రుస మాడ్చే వేడిమికి జనం అల్లాడిపోయారు.

భోజనాల ఏర్పాట్లు ప్రత్యేకంగా పేర్కొనదగినవి. మాగుంట సుబ్బరామ రెడ్డి, మాగుంట శ్రీనివాసుల రెడ్డి ద్వయం పూటకు 50,60 వేల మంది జనానికి షడ్రసోపేత విందు చేశారు. 14 డైనింగ్ హాళ్ళలో ఉదయం 8 నుంచి రాత్రి 12 గంటల వరకు నిరంతర అన్నదానమే. రుచులలో, శుభ్రతలో అణుమాత్రం తేడా రాకుండా అంత మందికి భోజనం ఏర్పాటు చేయడం ఎంత కష్టతర కార్యమో ఊహించలేము. త్రాగేందుకు ప్లాస్టిక్ గ్లాసులు, ఫిల్టర్ చేసిన నీళ్ళ కోసం అక్కడే యంత్రాలు అదీ వరంటే

కొరవ 12 పేజిలో

తిరుపతికి వచ్చిన ప్రతి ఒక్కరినీ తన మాయాజాలంతో పరవశుల్ని చేశారు ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి. ప్రధాని సైతం ఇందుకు మినహాయింపు కాలేదు. 60,70 ఏళ్ళ నుంచి క్రమం తప్పకుండా కాంగ్రెస్ ప్లీనరీలకు హాజరౌతున్న వృద్ధ నాయకులు సైతం ఆ ఏర్పాట్లు చూసి ముగ్ధులై పోయారు. విశ్వామిత్రుడు త్రిశంకు స్వర్గం సృష్టించినట్లే వుండింది రాజీవ్‌నగర్. మాగుంట సుబ్బరామ రెడ్డి నెలా పదిహేను రోజుల కష్టం పరిపూర్ణంగా ఫలించింది. ఎక్కడా ఏ చిన్న లోపమన్నది ఎదురుకాకుండా, ఎవరిలోనూ స్వల్ప అసంతృప్తి తల ఎత్తకుండా మూడు రోజుల సమావేశాలు నిరాఘాటంగా జరిగి పోయాయి.



అవరణంలో ఎక్కడ చూసినా పోలీసులే!





నలువేత్తుమాలతో పివిని స్వాగతిస్తున్న జనార్ధన రెడ్డి; సమావేశ మందిరంలో ఆశీనులైన ప్రతినిధులలో ఒక భాగం.

# పినాకిని తీరం

## స్థాయి దిగజారింది

కాంగ్రెస్ కార్యవర్గంలో ఎన్నిక ద్వారా భర్తీ కావలసిన పది స్థానాలకు పోటీలుంటాయా, లేక సర్దుబాటుగా ఏర్పాటిగా జరిగిపోతాయా ఇది వ్రాసే రోజుకు తెలియదు. ప్రధాని పివి ఏ సమస్యను అంత వరకు రానివ్వడం లేదు. ఈసారి ఏమౌతుంది మరి!

పత్రికలలో డాక్టర్ వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి గారి వురుములు మెరుపులు చూస్తూంటే పోటీ వుంది తీరుతుందనే అనిపిస్తుంది. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి గాని, పార్లమెంట్ కాంగ్రెస్ పార్టీ కార్యవర్గానికి కాని ఎన్నిక జరగడం కొత్తేమి కాదు. ఇది వరకు తీవ్రమైన పోటీలోనే అగ్రనాయకులనుకునే వారు కూడా ఎన్నికయ్యే వారు. ఇటీవలి సంవత్సరాలలో కామరాజ్ మంత్రంతో అంతా ఏకగ్రీవం అవుతున్నది. అందువల్ల పోటీ వున్నా వులిక్కి పడనక్కర లేదు. ఏకగ్రీవమైనా ఎగిరి గంతెయ్యాలనిలేదు. ఏదైనా కాంగ్రెస్ సాంప్రదాయమేనని సరిపెట్టుకోవచ్చు.

పోటీ చేస్తాన్ పోటీ చేస్తాన్ అని డాక్టర్ రాజశేఖర రెడ్డి గారు ఎగరడం; ఓడి పోయి ఎరుగనని చెప్పుకోవడం చూస్తూంటే విచిత్రంగా వుంది. కాంగ్రెస్ కార్యవర్గ సభ్యత్వం అంటే పాత రోజులను విందుకుందల వంటి తల నెరసిన నాయకాగ్రణ్యులను చూసిన నాబోటి వారికనిపిస్తుంది — ఆ పదివి అలంకరించడానికే కాదు పోటీ చేయదగిన స్థాయి కూడా రాజశేఖర రెడ్డి గారికి వున్నదా అని? కాంగ్రెస్ కార్యవర్గ సభ్యత్వం అంటే అందరూ పరిణతి చెందిన నాయకులుండే వారు; బహుకాలం సమస్యలతో ప్రజలతో పోరాటాలతో కాకలు తీరిన అనుభవజ్ఞులుండే వారు. ఆ స్థానం దిగజారలేదని, అందరూ ఆ స్థాయి గలిగిన నాయకులే ఇప్పుడున్నారని శాశ్వతంగా వుంటారని నేను చెప్పడం లేదు. అనుభవజ్ఞులు కనుమరుగవుతుంటే, ఆ తర్వాత వారితో ఆ స్థానాలు భర్తీ అవుతుండాలి. పాత కొత్తల మేలి కలయికతో దాని స్థాయి తగ్గకుండా వుండాలి. పోటీకేమి — తగినంత బలముంటే ఎవరైనా చేయవచ్చు. కాని రాజశేఖర రెడ్డి గారి రాజకీయ జీవితం వయస్సు పదమూరేళ్ళు; అందులో కాంగ్రెస్ అనుబంధం 12 ఏళ్ళు. అసలు ఆయన రాజకీయ జీవితం కాంగ్రెస్ మీద తిరుగుబాటుతోనే ప్రారంభమైంది. 1978 ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థిని ఓడించడంతోనే ప్రారంభమైంది; ఆయన మంత్రిగా చేసి వుండవచ్చు; ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడయ్యుండవచ్చు; తెలుగు దేశంతో వీరోచితంగా పోరాటం జరిపివుం డవచ్చు; ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డిని ధైర్యంగా ఎదుర్కొని వుండవచ్చు. ఇప్పుడు పార్లమెంట్ సభ్యుడు కావచ్చు. ఇవే కాంగ్రెస్ కార్యవర్గ సభ్యత్వానికి అర్హతలని ఆయన విశ్వాసం. కావచ్చు కాని, అవునని తెలిసిన వారనలేరు. అంత కంటే జూనియర్‌లు ఇంకా పెద్ద పదవులలో లేరా అంటే లేరని ఎట్లా చెప్పడం?. కాని రాజశేఖర్ రెడ్డి అధ్యక్షత ఎంత ఘోరంగా విఫలమైందో తెలయని వారెవరు? చిన్నవారు పెద్ద పదవులకొస్తే అంతే! పెద్దపదవుల్లో వడిదుడుకులు తొందర పాటులేని సమన్వయ స్వభావం కలిగిన వారు వుండడం మంచిదని కోరుకోదగి వుంటుంది కాని, ఎవరైతే పనునుకునే నిర్ణస్తిత సంస్థకు దేశానికి నష్టదాయకం.

డాక్టర్ రాజశేఖర్ రెడ్డి యువకుడు; సుదీర్ఘమైన భవిష్యత్తు వున్న వాడు; ఉన్నత పదవులకు అప్పుడే ఆరాటపడవలసిన అవసరం లేదు; సమయ పరిపక్వత కోసం వేచి వుండదగిన వాడు. అటువంటి వ్యక్తి ఎందుకు తొందరపడాలి? ఎప్పుడూ ఘర్షణ తత్వమనే చెడ్డ పేరెందుకు తెచ్చుకోవాలి? కక్ష, కార్పణ్యం పదవుల వేట ఆయన రాజకీయం అనే అపవాదుకు ఎందుకు గురికావాలి? పార్లమెంటు ఎన్నికానంతరం మొన్నటి వరకు పాటించిన గంభీర మౌనాన్ని మరికొంత కాలం పాటిస్తే ఎంత బాగుండేది. గతంలో అకాలంగా పదవులకోసం అర్రులు చాచిన వారు, ఆరాట పడ్డవారు చెల్లి పడ్డారు. అది ఇతరులకు కనువిప్పు కల్గించాలి. ఇదే తొందర పాటును మున్ముందు కూడా ప్రదర్శిస్తే రాజశేఖర రెడ్డికి ఇప్పుడుండే ప్రతిష్ట పరపతి తుడుచుకుని పోతాయి!

రాజశేఖర రెడ్డి గారి నడకలో నా స్వభావానికి సరిపోయే అంశాలు చాలా వున్నాయి. ఒకటి రెండు సందర్భాలలో ఆయన వైఖరిని ప్రశంసిస్తూ ఈ శీర్షికలోనే వ్రాశాను. కాని, బాధ్యత గల పదవులకు తగిన వారే వుండాలనేది నా అభిమతం.

## భలేభలే టైటిల్!

"డబ్బు భలే జబ్బు" అద్భుతమైన టైటిల్!. సినిమాలకు పేర్లు కరువై, తాత పేరును మనవడికి పెట్టుకున్నట్లు పాత పిక్చర్ల పేర్లని చేబదులు తీసుకునే వారు కొందరైతే, వినడానికే సహించని అసహమైన సభ్యతా రహితమైన నామకరణాలు గావించుకుంటున్న వారు కొందరు. ఛండాలపు పేరుకు తాజా నిదర్శనం 'పెళ్ళినీకు శోభనం నాకు' అనేది ప్రజానిరసనను గ్రహించిన దర్శక నిర్మాతలు తర్వాత ఆ పేరును సవరించు కున్నారనుకొండి!

పూర్వం సినిమా టైటిల్ చూస్తేనే చిత్రం కథ అవగాహ నయ్యేది; ఒక సమస్య ఇతివృత్తంగా, ఆ సమస్య పేరే సినిమా పేరుగా వుండేది. రైతు బిడ్డ, మాల పిల్ల, పంతులమ్మ, గృహలక్ష్మి వంటివి. పోతన, వేమన, త్యాగయ్య, దేవదాసు, లైలా మజ్నూ వగైరాలు సరేసరి అనుకొండి! అట్లా కథకు ముడిపడి

కరవ 10 పేజిలో



నెల్లూరు లయన్స్ క్లబ్ నిర్వహించిన మెల్లకన్ను ఉచిత కేంద్ర శిబిరంలో జ్యోతి నర్సింగ్ హోమ్‌లో అమర్చబడిన కొత్త పరికరాన్ని గూర్చి వివరిస్తున్న డాక్టర్ ఎన్. సుబ్రహ్మణ్య రెడ్డి. చిత్రంలో డాక్టర్ సత్యనాథ్, డాక్టర్ రఘురామ రెడ్డి, డాక్టర్ కొండా రెడ్డి ప్రభృతులున్నారు. (వార్త 11 వ పేజీలో)

# జమీన్ రైతు

## తిరుపతి నిర్ణయాలు

79వ కాంగ్రెస్ మహాసభ బహుముఖంగా ప్రధానమైనది. ఇరవై మూడేళ్ళ అనంతరం ఆంధ్రప్రదేశ్‌లో జరగడం; దేశ ప్రసిద్ధి గాంచిన ఒక పుణ్యక్షేత్రంలో మొదటి సారిగా జరగడం; ఒక తెలుగు వారు కాంగ్రెస్ అధ్యక్షుడుగా, ప్రధానిగా వున్న సమయంలో తెలుగు గడ్డ మీద జరగడం; ఇందిరా గాంధీ –రాజీవ్ గాంధీల వంటి ప్రజల్లో వెర్రి వ్యామోహం గల నాయకులు లేని పరిస్థితులలో జరగడం; కొత్త ప్రభుత్వం చేపట్టిన విధానాలు వివాదాస్పదంగా వున్న తరుణంలో జరగడం; ముఖ్యమంత్రిగా నేదురుమల్లి జనార్దన రెడ్డి నిర్మాణ దక్షత ప్రతిధ్వనించేట్లు జరగడం; ఈ విధంగా అనేక విశిష్టతలతో జరిగి, ఈ రోజే ముగిస్తున్న మహాసభలివి.

మెజారిటీ లేని స్థితిలో అధికారానికి వచ్చిన పి.వి. నరసింహారావు –రాజీవ్ గాంధీ హత్యానంతరం కాంగ్రెస్‌లో ఏర్పడిన నైరాశ్య వాతావరణంలో, మేధావిగా తప్ప ప్రజానాయకుడిగా ప్రఖ్యాతి లేనందువల్ల ఎదురయ్యే అనేక గడ్డు పరిస్థితులను, క్లిష్ట సమస్యలను ఎదుర్కొంటూ, మెళకువగా పరిష్కరించుకుంటూ, అటు పార్లమెంటులో ఇటు పార్టీలో కాంగ్రెస్‌ను సంఘటితంగా నడుపుతూ విజయవంతుడైన ప్రధానిగా కీర్తినే గాదు విశ్వాసాన్ని కూడా చూరగొన్నారు.

ఒకటి రెండు కాదు. అసంఖ్యాకమైన సమస్యలు తొడతట్టి సవాల్ చేసే సంక్షోభ స్థితిలో ప్రధాని అయ్యారు పి.వి. దేశం ఆర్థికంగా దివాలా తీసింది, పరపతి నశించింది. విదేశీ వాణిజ్యం పూజ్యమైంది. అభిమానం చంపుకొని బంగారు కుదువ పెట్టిన దౌర్భాగ్య పరిస్థితి వారసత్వంగా సంక్రమించింది; మతతత్వ పార్టీ అయిన బిజెపి ప్రాబల్యం, వామపక్షాల పేరుతో కాంగ్రెసేతర పార్టీల గ్రుడ్డి ద్వేషం, పంజాబ్, కాశ్మీర్, ఘుర్కా, బోడో జార్కండ్ ఉల్ఫాల వంటి తీవ్రవాద హింసాప్రజ్వలన..... ఒక్క టేమిటి, ఇటువంటి పాములు తేళ్లు, పులులు సింహాల వంటి సమస్యలను తొణకకుండా తొందర పడకుండా సహనాన్ని కోల్పోకుండా సంయమనంతో తక్కువ కాలంలో గాడి తప్పిన దేశ పరిస్థితులను ఒక మార్గంలో పెట్టగలిగాడు; దేశానికి ప్రతిభావంతుడైన ప్రధాని లభించాడనే సంతృప్తిని కల్గించ గలిగాడు పి.వి.

తిరుపతి కాంగ్రెస్ తీర్మానం కాని, నాయకుల వుపన్యాసాలు కాని, ఆర్థిక పారిశ్రామిక విధానాల్లో నెహ్రూ మార్గాన్ని వీడలేదని, వీడబోమని ఎంత చెప్పినా, పి.వి. ప్రభుత్వం చేపట్టిన ఆర్థిక విధానాలు నెహ్రూ నిర్దేశించిన వాటికి పూర్తిగా భిన్నమైనవి. కాని, నలభై ఏండ్ల ప్రయోగాలు, అనుభవం తరువాత ప్రపంచ వ్యాప్తంగా తలక్రిందులుగా వచ్చిన వస్తున్న మార్పులను గమనిస్తూ, దేశ పరిస్థితులకు అనుగుణంగా అత్యవసరంగా తీవ్రమైన మార్పులు తీసుకరావలసిన అవసరం ఏర్పడినప్పుడు నెహ్రూ మూల సిద్ధాంతాలను మనసులో వుంచుకొని – కొత్త దారి చేపట్టడం తప్పు కాదు. ఇది సత్ఫలితాలివ్వగల్గితే సంతోషం; లేకుంటే సవరించుకోవడం ఎప్పుడైనా ప్రభుత్వం చేతిలో పని.

బిజెపితో కాంగ్రెస్‌కు లాలూచీ వున్నదనే దుష్ప్రచారానికి ముఖం మీద కొట్టినట్లు తిరుపతి మహాసభ సమాధానం చెప్పింది. బిజెపితో కాని, మత తత్వ వాదులతో గాని, కాంగ్రెస్‌కు ఇప్పుడే కాదు, భవిష్యత్తులోనూ ఎటువంటి పొత్తూ వుండబోదని చెప్పి, మతశక్తులను అణచడంలో ప్రజల సహకారాన్ని అభ్యర్థించింది కాంగ్రెస్ మహాసభ. బిజెపి బలసంపన్నం కావడానికి జనతాదళ్ వామపక్షాల కూటమే బాధ్యులని పేర్కొనడం వాస్తవం. ముస్లిం లీగ్ విషయంలో కూడా కాంగ్రెస్ వైఖరి ఈ విధంగానే వుంటే ఎవ్వరూ వ్రేలెత్తి చూపడానికి ఆస్కారం వుండదు. అయోధ్య సమస్య పరిష్కారంలో నేటి దృఢవైఖరినే తిరుపతి మహాసభ పునరుద్ఘాటించడం సముచితంగా వుంది.

ఈ విధంగా తిరుపతి మహాసభ నేడు దేశాన్ని ఆందోళన పరుస్తున్న అనేక సమస్యల విషయంలో ప్రభుత్వానికి అవసరమైన సూచనలు చేసింది. ప్రత్యేకంగా పంజాబ్‌లో ఎన్నికలు జరపడాన్ని అభినందిస్తూ, కాశ్మీర్ విషయంలో కూడా సత్వర చర్యలు తీసుకోవలసిందిగా కోరింది.

తిరుపతి కాంగ్రెస్ ప్లీనరీ అపూర్వంగా, చిరకాలం జ్ఞాపకం వుండే రకంగా జరగడమే కాదు; పివి ప్రభుత్వ విధానాలకు, పివి నాయకత్వానికి కాంగ్రెస్‌లోని అన్ని వర్గాల ఆమోదాన్ని తెల్పడం ద్వారా ఘనవిజయాన్ని చేకూర్చింది. ముఖ్యంగా ఆర్థికంగా మూల విధానంలోని మార్పులకు విదేశాంగ విధానంలో స్వాతంత్ర్యానంతరం ప్రప్రథమంగా ఇజ్రాయిల్‌తో దౌత్య సంబంధాలు పెట్టుకోడానికి తిరుపతి మహాసభ సమర్థనను పొందగలగడం ప్రధాని విజయం క్రిందే లెక్క. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగడానికి ఇది పివికి ఎంతో ఉపకరిస్తుంది.

# జమీన్ రైతు

17-4-1942

8 పేజీలు అణా

### నెల్లూరు ముచ్చట్లు

#### హిందూ, మహమ్మదీయులకు

యుద్ధం మన నెత్తి మీదకు వచ్చినప్పుడు కూడా మనం తెలుసు కోలేక మత కలహాల్లో మునిగి గుడ్డి వాళ్ళ లాగా సంచరిస్తున్నాము.

హిందూ భ్రాతలారా! నెల్లూరు ఏదైనా ప్రమాదం వస్తున్న దంటే ఇళ్లు, వాకిళ్లు వదలిపెట్టి ధనవంతులైన హిందువులు వెళ్తారు కదా! అప్పుడు మన యిండ్లు దాడి వారి వీధి మాదిరే లూటీలు జరగవా?

మహమ్మదీయులారా! ఒకవేళ నెల్లూరుకేమైనా ప్రమాదం హెచ్చి ఖాళీ చేయవలసివస్తే మీరు పల్లెల్లోకి ఈ మత ద్వేష విషంతో ఎట్లా పోతారు? ఆనాడు ఎంత ఘోరంగా వుంటుందో వూహించండి.

ఈ రెండు ప్రమాదాలను యిరుమతాలవారు ఊహించారంటే వెంటనే ఆపద్ధర్మంగానైనా రాజీ పడి సమష్టి కార్యకలాపానికి తిర్గుతారు.

వెంటనే ఇరువక్ష పెద్దలు ఒక చోట తలకాయలు బట్టుకొని ఆలోచించండి మహప్రభో!!

#### అల్లూరు బోర్డు

బల్గేరియా మంత్రి వర్గంలో మార్పు. ఫ్రెంచ్ మంత్రి వర్గంలో మార్పులే కాక అల్లూరు బోర్డు మెంబర్లు 11లో 8 మంది ఒక్కుమ్మడి రాజీనామా పెట్టారని అమెరికా ఆందోళన పడుతున్నది.

#### ఉరిశిక్ష

పద్మనాభుని సత్రంలో తే 7-10-41 దిన కోటమ్మ అను స్త్రీని చంపినాడన్న కేసులో నెల్లూరు జడ్జి తీర్పు చెప్పుచూ వెంకయ్య అను ముద్దాయికి ఉరిశిక్ష విధించిరి.

#### నెల్లూరు మునిసిపాలిటీ

నెల్లూరు మునిసిపల్ స్పెషల్ మీటింగ్ 14 తేది ఉ. ఆఫీసులో జరిగింది. మునిసిపల్ నీళ్ళు చల్లే లారీ తమకు కావలెనని గవర్నమెంటు వారు కోరిన మేరకు నెల్లూరులో మత గలాటాలున్నవనీ, కొంపలు తగులు కోవడం ఇచట విశేషమనీ, అందుచేత లారీ ఇచ్చుటకు వీలులేదని తీర్మానం

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

ప్యాసుచేశారు. అన్నదేవుల రామిరెడ్డి గారు మాత్రం తీర్మానాన్ని ఎదిరించారు. శత్రు విమానాల దాడుల భయం వుందిగనుక, శత్రు విమానముల రాకను హెచ్చరించే సైరన్ నొకదానిని కొనవలసినట్లునూ, ప్రజా రక్షణ కొరకు అచటనచట కందకాలు త్రవ్వించుటకు రూ. 500 లు ఖర్చు పెట్ట వలసినట్లు తీర్మానించబడింది.

#### దీపాల నిర్బంధము

నెల్లూరు జిల్లా అంతటా పూర్తిగా దీపాల నిర్బంధం ఈ నెల 13 తేది నుండి అమలు పేరవాలని జిల్లా మేజిస్ట్రేటు గారు ప్రకటించారు. ఈ నిబంధనల ప్రకారం యిండ్లలోని దీపాల వెల్తురు బయటకు కనపడ కూడదు. అలంకారాలకు గాని, అడ్వర్ టైజ్‌మెంట్లకు గాని, యింటికి వెలుపల ఏలాటి దీపాలు వుంచకూడదు. దీపాల వెలుతురు కిరణాలు క్రిందికి పారవలసి వుంటుంది. టార్చ్ లైట్ల మూతలు అంగుళం మించ కుండా కప్పవలెను. చుట్టు ప్రక్కల తెల్లని, గోధుమ రంగు గోడల మీద వెలుతురు పడకూడదు. అవసరమైతే ఆ గోడలకు నల్ల రంగు వేయవలెను; లేకుంటే దీపాలే ఆర్పవలెను. ఏ బండ్లు గాని రాత్రి వేళ ఇరవై మైళ్లు వేగం మించి పోకూడదు. చేతి లాంతర్లు, మైనపు వత్తి, దీపము కంటే ఎక్కువ వెల్తురు కల దీపములు వీధులలోకి తేకూడదు. ఈ ఉత్తర్వుతో నెల్లూరు రాత్రి పూట చీకటి కోణమైంది

#### నెల్లూరులో విమానదాడి జాగ్రత్తలు

విమానదాడి ఏదైనా జరిగేయెడల టవున్‌లో ప్రజలకంతా తెలియడానికి నగారాలు, పెద్దగంటలు, వాయించడానికి ఏర్పాట్లు జరుగు తున్నట్లు అనధికార వార్త

* * *

విమాన దాడి హెచ్చరికలు జరిగిన తర్వాత, నిజంగా దాడులు జరిగితేనే గవర్నమెంటు వారి ప్రకటన వుంటుంది. లేకపోతే వుండదు.

## బాలాజీ జిల్లా ఆలోచనే వద్దు!

నెల్లూరు జిల్లాను మరొకసారి విడగొట్టి బాలాజీ పేరిట కొత్త జిల్లా ఏర్పాటు చేయబోతున్నారన్న వార్త జిల్లా వాసులందరినీ ఆందోళన పరుస్తున్నది. నెల్లూరు జిల్లాను ఎన్నిసార్లు ఖండఖండాలుగా నరుకుతారు? మొదట శ్రీ కాళహస్తి, ఒంగోలు తాలూకాలను చిత్తూరు, గుంటూరు జిల్లాలకు తరలించారు. ప్రకాశం జిల్లాఏర్పాటు చేసి కందుకూరు డివిజన్ మొత్తం – కనిగిరి, కందుకూరు, పొదిలి, దర్శి తాలూకాలను ఊడబెరికారు. ఇప్పుడు నాయుడుపేట, సూళ్ళూరుపేట, వెంకటగిరి తాలూకాలు పూర్తిగా; గూడూరు తాలూకాలో కొంత ఖండించనున్నట్లు చెప్తున్నారు.

వెంకటగిరి నాయుడుపేటలు త్వరలో మునిసిపాలిటీలు కానున్న పట్టణాలు; సూళ్లూరుపేట పోతే శ్రీ హరికోట మనది కాకుండా పోతుంది. కొత్తగా ఏర్పడిన ఎమ్మీ చక్కెర ఫ్యాక్టరీ పరాయిదవుతుంది. మద్రాసు సరిహద్దు కోల్పోతే, నెల్లూరు జిల్లా ప్రాధాన్యత క్షీణిస్తుంది. తడలోని పరిశ్రమలు మనవి కాకుండా పోతాయి. పరిపాలనావసరాల కోసం జిల్లాలు ఏర్పడినా, అవి మానసికంగా ప్రజలను ఎంత దూరం చేస్తాయో ప్రకాశం జిల్లా ఏర్పాటులోనే మనకు అర్థమైంది. ఒక్కొక్క నాయకుడు తమ అనుకూలతలననుసరించి జిల్లాను విడగొట్టుకుంటూ పోతుంటే, జిల్లా ఉనికే ప్రశ్నార్థకమౌతుంది. నాయకులు అశాశ్వతమే గాని, జిల్లాలు శాశ్వతం. ఈనాటి రాజకీయావసరాలకు జిల్లా భౌగోళిక స్వరూపాన్ని నాశనం చేయడం ఘోరమైన తప్పిదం, జిల్లా ప్రజలందరూ ఈ ప్రతిపాదనను గట్టిగా ప్రతిఘటించాలి; నెల్లూరు జిల్లా స్వరూపాన్ని పరి రక్షించుకోవాలి!

– ఎ.వి. శేషగిరిరావు

విజయవాడ

### జనవాణి

#### హరిజనుల్లారా– బాధ్యత వహించండి!

అంబేత్కర్ శత జయంతోత్సవాలు ముగిశాయి. ఆ మహనీయుడు దళిత వర్గాల సముద్ధరణకు చేసిన కృషి, పడిన శ్రమ, అనుభవించిన కష్టనష్టాలు, మనల్ని ఈనాడీరూపంలో వుంచాయి. అయితే ఆయన త్యాగ ఫలితంగా ఏర్పడిన సౌకర్యాలను మనం సక్రమంగా వినియోగించు కుంటున్నామా? త్రాగుడుకో, ఇతర దుర్వ్యసనాలకో బానిసలై కూలీనాలీ చేసి సంపాదించిన డబ్బు తగలేసి, ఎందరు హరిజనులు తమ పిల్లల భవిష్యత్ పాడుచేస్తున్నారు? రిజర్వేషన్ సౌకర్యాలు కొల్లలుగా వున్నా ఉపయోగించుకోకుండా, తమ బిడ్డలను గాలికి వదిలివేసేవారు ఎందరున్నారు? సమాజంలో సమస్థానం పొందడానికి ఉద్యమాలు, ఉపన్యాసాల కంటె చదువు, సంస్కారం అవసరమన్న వాస్తవాన్ని, ఎందరు గుర్తిస్తున్నారు? అస్పృశ్యసాంప్రదాయం వికృ రూపంలో

కొరవ 8 పేజీలో

# చేపల పెంపకమే రైతుకు శ్రేయోదాయకం?

బొంబాయిలోని సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫిషరీ ఎడ్యుకేషన్‌లో నెల్లూరీయులైన ప్రొఫెసర్ పి.ఎస్. రావు ఫిషరీ ఎకనామిక్స్ విభాగాధిపతి. నెల్లూరు జిల్లాలో అధికంగా చేపల పెంపకం విస్తృతంగా వ్యాపిస్తున్న నేపథ్యంలో ఆయన రైతుల ఉపయోగార్థం ఒక విశాలమైన వ్యాసం వ్రాసి పంపారు. అదే సంస్థలో బయాలజీ విభాగం అసిస్టెంటు ప్రొఫెసర్గా పనిచేస్తున్న శ్రీ పి. ఆచార్య ఈ వ్యాసంలో తన సహకారాన్ని అందించారు. చేపల పెంపకంలో రైతులు తమ సందేహాలు తీర్చుకోదలిస్తే – ప్రొఫెసర్ పి.యస్. రావు లేదా శ్రీ పి. ఆచార్య, సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫిషరీస్ ఎడ్యుకేషన్, జయప్రకాష్ రోడ్, సెవన్ బంగళాస్, వెర్సోవా, బొంబాయి 400 061 చిరునామాకు వ్రాయండి.

సరస్సులు, నదులలో చేపల వేట– మానవ జాతి చరిత్ర అంతటి అనాదిది. అయితే చేపలను నిర్ణీత చెరువులు, నీటి గుంటలలో వేసి పెంచే పద్ధతి మొట్టమొదటగా చైనాలో కనిపెట్టినట్లు తెలుస్తోంది. రోమన్ సంస్కృతిలో కూడా చేపల పెంపకం ఒక భాగమే. చిన్న చిన్న చెరువులలో చేపలను నిల్వచేసి, అవసరమైనపుడు ఆహారానికుపయోగించడం, అలంకరణ కోసం తమ ఇళ్ళ ఆవరణంలో చేపలు పెంచడం రోమన్ కాలం నాడు జరిగేది. ఈజిప్ట్ పిరమిడ్‌లపై కూడా చేపలు పట్టే దృశ్యాలు చిత్రీకరించి వున్నాయి.

చైనాలో పట్టు పురుగుల పెంపకంతో పాటు, చేపల పెంపకమూ సరిసమానంగా అభివృద్ధి చెందింది. పట్టు పురుగులకు చేపలు మంచి ఆహారంగా వారు భావించే వారు. భారత దేశంలోనూ దేవాలయకోనేరులలో చేపలు పెంచడమనే సాంప్రదాయం పురాతన కాలం నుంచి వుంది. అయితే చేపల పెంపకం పట్ల శాస్త్రీయ


ప్రొఫెసర్ పి.ఎస్. రావు
శ్రీ పి. ఆచార్య
సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫిషరీస్ ఎడ్యుకేషన్
బొంబాయి


దృక్పథం మాత్రం లేదు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం 'గ్రోమోర్ ఫుడ్' అనే నినాదం ప్రపంచమంతా నినదించిన తర్వాతనే చేపల పెంపకం ఒక పరిశ్రమగా అభివృద్ధి చెందడం ప్రారంభమైంది. మన దేశంలో మొదట మొదట మత్స్యకారుల అభివృద్ధికే ఈ విషయంలో ప్రాధాన్యమిచ్చారు. ఇప్పుడు ఈ పరిశ్రమ ఎంత శీఘ్ర గతిన పురోగమిస్తున్నదంటే, భూమి ఆధారంగా జరిగే పంటలు, తోటల సాగుతో చేపల పెంపకమూ సమస్థాయి పొందగల్గే రోజు దగ్గరపడే విధంగా పరుగులు పెడుతున్నది. చేపలు, రొయ్యలు వంటి వాటిపై పెట్టుబడి పెట్టడానికి ఎందరో ముందుకు వస్తున్నారు. వ్యవసాయం కంటే ఈ పరిశ్రమ లాభదాయకమైనదని నిరూపిస్తున్నారు.

## చేపల పెంపకం ఎందుకు చేపట్టాలి?

ప్రజలకు అవసరమైన పోషక ఆహారం మాంసం, పాలు, కోడిగ్రుడ్లు వంటి వాటి ద్వారా అందుతున్నపుడు చేపల పెంపకాన్ని ఎందుకు చేపట్టాలి అనే ప్రశ్న తరచు ఉత్పన్నమౌతుంటుంది. అయితే పై ఆహారపు పదార్థాలన్నిటికంటే చేపలు మనిషికి బలమైన పోషక పదార్థాలు సమకూర్చగల్గుతాయని పరిశోధనలలో తేలింది. అంతే కాదు – ఇతర పదార్థాలతో పోల్చినప్పుడు చేపలను ఆహారంగా తీసుకోవడం ద్వారా పలు వ్యాధులను నివారించే వీలుంది. కళ్ళు, చర్మం, పళ్ళు, ఎముకల సక్రమ నిర్వహణకు అవసరమైన ఎ, డి విటమిన్లు చేపల కొవ్వులో అత్యధికంగా వుంటాయి. చేప మాంసంలో బి విటమిన్ అధికం. ఫాస్ఫరస్ పొటాషియం, ఐరన్, అయోడిన్ వంటి లవణాలు చేపలలో విస్తారంగా లభిస్తాయి. చేపలలోని ఫ్లోరైడ్ దంత వ్యాధులను నివారిస్తుంది. సముద్రపు చేపలలోని మెగాకికి అనే కొవ్వు మనిషి శరీరంలోని కొలెస్టరాల్‌ను తగిన పరిమాణంలో వుంచేటట్లు చేస్తుంది. చేపలలోని సిలీనియం వల్ల క్యాన్సర్

కొరవ 10 పేజీలో




నెల్లూరు రామలింగాపురంలోని సాయి విద్యానికేతన్ వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తున్న శాసన సభ్యుడు జె.కె. రెడ్డి చిత్రం ఎడమ నుండి: మునిసిపల్ ఉద్యోగుల సంఘాధ్యక్షుడు పుట్టా గోపాల రెడ్డి, పెళ్ళకూరి రవీందర్ రెడ్డి, ప్రధానోపాధ్యాయిని పద్మావతి.

## హైదరాబాదు నుండి నెల్లూరుకు ఐదురోజులా?

దిక్కు దివాణం లేని నెల్లూరు పోస్టల్ శాఖను నిందించడమా, నిర్వాకంగా వున్న పోస్టల్ సిబ్బందిని నిలదీయడమా – తెలియడం లేదు. రెండింటినీ విడదీయలేము. ఆఫీసర్లయినా, సిబ్బంది అయినా ఒకే శాఖకు చెందిన వారే కదా! అందువల్లనే మాకుమ్మడిగా పోస్టల్ శాఖను దోషము, నిర్లక్ష్యములేని శాఖ అని దూషించవలసి వస్తున్నది. రోజురోజుకు దిగజారి పోతున్న పోస్టల్ శాఖ పనితీరును చూచినపుడు సహనం కోల్పోయి, సభ్యతను ప్రక్కనపెట్టి పరుషంగా వ్రాయవలసి వస్తున్నది.

ఆచార్య రంగా విద్యుత్ ముందు ఒక మిత్రుడు మూలపేటలో పోస్టు చేసిన కార్డు టవున్ లోనే ప్రయాణించి కిలోమీటర్ దూరంలో వున్న 'జమీన్‌రైతు' ఆఫీసుకు నెలరోజులకు చేరింది. ఇటువంటివి ఎన్నో, ఎన్నెన్నో. పనిపాటులేకుండా, ఫలితం లేని దానికి ప్రతి వారం చోటు దండగ చేసుకోవడం ఎందుకు? కాగితం ఖరారు చేయడం ఎందుకు? అనిపిస్తుంది. అయినా ఒక ప్రజాపయోగ ప్రభుత్వ సంస్థ, ఒకప్పుడు ప్రతిష్ఠాకరంగా కీర్తిదాయకంగా బ్రతికిన సంస్థ, ప్రజలకు అనుపమానంగా సేవ జేసిన శాఖ ఈనాడు ఇంత పతనావస్థకు రావడాన్ని చూడలేక, మనసొప్పక వ్రాయక తప్పడం లేదు.

శ్రీ కె. ఎస్. రావు పేరు పెక్కుమందికి తెలిసే వుంటుంది. ఐదేళ్ళ పాటు పార్లమెంటు సభ్యుడుగా

### సింహపురి

వుండిన వారు కాబట్టి పోస్టల్ శాఖ వారికి సాధారణంగా తెలిసే వుండాలి. ఆ కె.ఎస్. రావు కుమార్తె శ్రీవాణికి ఏప్రిల్ 12 తేది సికిందరాబాదులో పెండ్లి. ఆయన మాకు ఆహ్వానం పోస్టు చేశారు; మహాత్మాగాంధీ సాక్షిగా (పోస్టల్ బిళ్ళ మీద గాంధీజీ బొమ్మ వుంది) 8 తేది హైదరాబాదు పోస్టల్ ముద్ర పడి వుంది. ఆ ముద్ర బొమ్మను ఇక్కడే ప్రకటిస్తున్నాము; ఎంత స్పష్టంగా వుందో చూడండి. హైదరాబాదు నుంచి వ్రాసిన కార్డు ఆయన వచ్చిపోయిన తర్వాత చేరిందని వ్రాస్తూ బొమ్మతోటి ప్రకటించాము. అంతకు

కొరవ 11 పేజీలో



### సణుగుడు

## తిరుపతి సభల తీరును తప్పు పట్టడమే తప్పు!

ఇండియా ఎంత పేద దేశమో సత్యజిత్ రే సినిమాలు చూస్తే తెలుస్తుంది; ఇండియా ఎంత సంపన్న రాజ్యమో రాజీవ్ నగర్ విశేషాలు వింటేనే తెలిసిపోతుంది. ఏ దేశ చరిత్రలోనూ పాలితులు పొట్టకూటికి అలమటిస్తారే తప్ప, పాలకులు అజీర్తి రోగానికి మందులిప్పుడు జేబులో పెట్టుకోవడం మర్చిపోరు. ప్రజలు మురికివాడలలో మ్రగ్గిపోతున్నప్పుడే రాజుల మహాప్రాసాదాల వన్నెచిన్నెలకు విలువ ఏర్పడుతుంది. సాదా జనమూ బంగారు జరి చొక్కా వేసుకుంటే, నేతల జలతారు వస్త్రాలు చూసెదెవరు? మురిసెదెవరు? తరతరాల భారతీయ ఆకలి సంస్కృతిని, అష్టదరిద్రపు ప్రజా జీవన శైలిని పదిలంగా పొంది, దేశం పట్ల తమ భక్తిప్రపత్తులను చాటుకోవడం కాంగ్రెస్ విధి. సాదాసీదాగా సభలు జరిపితే ఫారిన్ డెలిగేట్లు పెదవి విరిచి బిలియన్‌ల అప్పును కాస్త మిలియన్లకు

### డోలేంద్ర

కత్తిరించి వేసేప్రమాదం వుంది కదా! ఆ దృష్టితో చూసినపుడూ కాంగ్రెస్ సభలు అంత రంగ రంగేళిగా జరపడం దేశ భక్తి కార్యమేగాని, దుబారా క్రింద పరిగణనకు రానే రాదు.

ఈ మధ్య రాజకీయాలలో సినిమా నటుల న్యూసెన్స్ పెరిగి పోయింది. ఎన్.టి. రామారావు, రాజ్

### అయో 'మయ' సభ

☆ సి. నారాయణ రావు ☆

పేరు.....
సామాన్యుని
ఊహావిహాయసాన
విహరింపజేసే
కోటి ఆశల
పూల తేరు!
సంపదకోసం
స్వాప్నికులయి
ఈ అయో 'మయ' సభలో
అడుగిడితే ఎదలో రేపునుపోరు!

లక్ష్మిని స్ఫురింపజేసి
మరుక్షణం దూరం మాసే
విలక్షణ వ్యాపారానికిది
మారు పేరు!
ప్రలోభపడి పరుగిడితే
లెక్కలన్నీ తారు మారు!
కంపెనీల పని తీరు
మరచి మదుపెడితే
బ్రతుకులే కడతేరు!!

కుమార్, జయలలిత వంటి వారు తెర మీద దర్శనమిచ్చినట్లు హఠాత్తుగా రాజకీయ రంగంపై ప్రత్యక్షమై జనాన్ని సమ్మోహితులను చేసేస్తున్నారు. ప్రజలంతా సినిమాయా ప్రపంచపు తళుకు బెళుకులకు భ్రమసి ప్రవాహంగా అటు తరలివెళ్లిపోతే, కాంగ్రెస్ వారుల పదవులు, ఏవరు ఏమైపోను? సెట్టింగులు వేయడంలో, కళాత్మకతను ప్రదర్శించడంలో సినిమా నటులకు తామేమి తీసిపోమని నిరూపించు కోవలసిన అవసరం అర్జెంటుగా ఏర్పడి వుంది నాయకులకిప్పుడు! హీరోల పరిరక్షించడంలో తన వంతుకర్తవ్యాన్ని త్రికరణశుద్ధిగా లేకుండా నిర్వహిస్తున్న కాంగ్రెస్ పార్టీ, తిరుపతి సభలను ఆ తీరులో జరపడంలో తప్పు లేశ మాత్రం లేదు.

ప్రపంచంలో అతి పెద్ద ప్రజాస్వామిక దేశాన్ని పరిపాలించే పార్టీ ప్లీనరీ జరిగేటప్పుడు దేశ విదేశాలనుంచి ప్రతినిధులు వస్తారు; తమ నలభై ఏళ్ల పరిపాలన తర్వాత దేశం ఎంత సుభిక్షంగా వుందో, సుజలాం సుఫలాం అన్నట్లుందో వారికి చూపించి, వారి నుంచి మరిన్ని బిలియన్ డాలర్ల అప్పు

కొరవ 8 పేజీలో

# స్తోత్ర పాఠాలు తప్ప చర్చలు లేవు!

ఏఐసిసి సమావేశపు ఏర్పాట్లు ఎంత భారీగా వున్నాయో అజెండా అంత కురచగా వుంది. సంతాప తీర్మానాలు, ఆర్థిక, రాజకీయ, విదేశీ వ్యవహారాలపై స్వల్ప చర్చ మాత్రమే అజెండా!

రాజకీయ తీర్మానం 32 పేరాల సుదీర్ఘమైనది. 14 తేది సాయంత్రం కేంద్రమంత్రి శ్రీ అర్జునసింగ్ దీనిని ప్రతిపాదించారు. దేశం ఎదుర్కొంటున్న సమస్యలన్నింటినీ రేఖా మాత్రంగా సమీక్షించారిందులో!

బిజెపితో పొత్తుపై చెలరేగుతున్న విమర్శలకు సమాధానమా అన్నట్లు, ఆ పార్టీని ఏకిపారేసింది తీర్మానం. జాతిపిత మహాత్మాగాంధీని పొట్టన పెట్టుకున్న మతోన్మాదాన్నే బిజెపి అప్పుడు దేశంలో వ్యాపితం చేస్తున్నదని, ఆ విషానికి కాంగ్రెస్ మాత్రమే విరుగుడు అని పేర్కొన్నారు. పాకిస్తాన్ కుతంత్రాలను నీళ్లు నమలకుండా ప్రస్తావించారు. పంజాబ్, కాశ్మీర్‌లలో ఆ దేశం తీవ్రవాదాన్ని ప్రోత్సహించడం మానుకోక పోతే ఓర్పు చూపడం ఇక వీలుకాదని తీర్మానం హెచ్చరించింది. ఎల్‌టిటిఇ విషయంలో మాత్రం ఎందువల్లనో ఈ తీవ్రత చూపలేదు. తుపాకి గురిపెట్టే అనాగరిక టెర్రరిజం ద్వారా భారతదేశ సమగ్రతను విచ్ఛినం చేయడానికి జరిగే ప్రయత్నాల పట్ల కాంగ్రెస్ ఆందోళన ప్రకటించింది. ఉత్తర భారతంలో ఇందిరమ్మ, దక్షిణ భారతంలో రాజీవ్‌గాంధీ చేసిన ప్రాణత్యాగం, మాతృదేశం పట్ల ప్రతి పౌరుడూ ప్రదర్శించవాల్సిన త్యాగ గుణానికి విశిష్ట సంకేతంగా భావించాలని పిలుపునిచ్చింది కాంగ్రెస్. లౌకిక ప్రజాస్వామ్య పరిరక్షణకు, సంఘర్షణాత్మక రాజకీయాల నివారణకు, ఏకాభిప్రాయం ద్వారా సమస్యల పరిష్కారానికి, సామాజిక న్యాయ సాధనకు పునరంకితమౌతున్నట్లు కాంగ్రెస్ ప్రకటించింది.

ఆర్థిక తీర్మానం చెంతవరి. దివాలా స్థితిలో గద్దెనెక్కిన పివి ప్రభుత్వం దేశాన్ని ముందుకు నడిపించడానికి అనుసరిస్తున్న ఆర్థిక విధానాలు ఎంతటి వివాదాస్పదంగా తయారైనాయో తెలిసిందే! తాము సోషలిజం పంథా తప్పలేదని, నెహ్రూ లక్ష్యాలను విస్మరించలేదని, దేశానికి వివరించడానికి ఈ తీర్మానంలో చాలా శ్రమ తీసుకున్నారు.

> * ఏర్పాట్లు బ్రహ్మాండం— సమావేశాలు పేలవం!
> * ఒక్క తీర్మానంపైనా చర్చ జరగలేదు
> * ప్రధానిని భగవంతుడి అవతారంగా పోల్చే పెద్ద మనుషులే ఎక్కువగా కన్పించారు

"ఆర్థిక రంగంలో దృఢత్వం, విజ్ఞాన పరంగా పురోగతి సాధించాలనే ఆశయంతో నెహ్రూ ప్రారంభించిన పబ్లిక్ రంగ పరిశ్రమలు, ప్రభుత్వ బడ్జెట్‌కు డ్రెయిన్‌గా తయారైనాయి; తమ అభివృద్ధికి నిధులను సమకూర్చుకోవడం వాటి చేత కావడం లేదు. ఇంకోక ప్రక్క ప్రైవేటు రంగం బాగా విస్తరించింది. భారీ పరిశ్రమల స్థాపనకు వాటికి స్తోమత వున్నపుడు, పబ్లిక్ రంగం వుండాలనే నెపంతో వేల కోట్ల నిధులు ఆ వైపుకు తరలించే పరిస్థితిలో ప్రభుత్వం లేదు. అయితే కీలకమైన రంగాలలో పబ్లిక్ రంగ ప్రాధాన్యతను పరిరక్షించడాన్ని కాంగ్రెస్ ఎప్పుడూ విస్మరించదు" అని వివరించారీ తీర్మానంలో! విదేశీ నిధులతో పరిశ్రమలు స్థాపించేందుకు ఇచ్చిన అనుమతి కూడా నెహ్రూ విధానాలకు వ్యతిరేకం కాదంటుంది తీర్మానం. ఇది వరకు 51శాతం విదేశీ పెట్టుబడికి అనుమతించే వారు.అయితే ప్రతి దరఖాస్తునూ విడివిడిగా పరిశీలించే పద్ధతి వల్ల అవినీతి, ఆలస్యం, అధికారుల మితిమీరిన ప్రమేయం పరిశ్రమల రంగం అభివృద్ధిని నిరోధించేవి. ఇప్పుడు ఆ అటంకాలు తొలగించడంతప్ప, విధానాలలో చేసిన మార్పేమీలేదన్నది తీర్మానం వివరణ.

పివి ప్రభుత్వ ఆర్థిక సంస్కరణల వల్ల విదేశీ మారక ద్రవ్యాల నిల్వలు 1991 జూన్ నుంచి 1992 ఏప్రెల్ మధ్య 2500 కోట్ల నుంచి 15 వేల కోట్లకు పెరిగాయని; ఈ సాహసోపేత సంస్కరణలను కాంగ్రెస్ పార్టీ సంపూర్ణంగా సమర్థిస్తున్నదని తీర్మానంలో ప్రకటించారు. అయితే సామాన్య మానవుడి జీవన ప్రమాణం మెరుగుదలకు చేయవలసింది ఇంకా చాలా వుందని ప్రభుత్వాన్ని హెచ్చరించింది తీర్మానం. సంస్కరణ పేరుతో కాంగ్రెస్ పార్టీ దేశ సార్వభౌమత్వాన్ని తాకట్టు పెట్టిందన్న విమర్శను తీర్మానంలో నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. ప్రపంచ మంతా నెహ్రూ భవిష్యద్దర్శనం చేసిన రూపాన్ని సంతరించుకుంటున్నపుడు, కాంగ్రెస్ పార్టీ నెహ్రూ [illegible]నాల దారి తప్పుతుందనుకోవడం కేవలం భ్రమ; దేశ ప్రజలు గర్వపడేటట్లు, ఇతరులు మనల్ని చూసి నేర్చుకునేటట్లు ఆర్థిక రంగాన్ని అభివృద్ధి చేయడానికి కంకణం కట్టుకున్నాం — అన్నారీ తీర్మానంలో!

విదేశీ వ్యవహారాల తీర్మానం అన్నిటిలోకి చిన్నది. ఆర్థిక తీర్మానం వలెనే, ఇందులోనూ ప్రభుత్వ విధానాలలోని మార్పుల పట్ల చెలరేగుతున్న విమర్శలకు సమాధానమివ్వడానికే ఎక్కువ శ్రమపడ్డారు. వీటిలో ప్రధానమైనది ఇజ్రాయిల్‌తో దౌత్య సంబంధాల స్థాపన. మధ్య ప్రాచ్యంలో ప్రారంభమైన శాంతి యత్నాల ఫలితంగా పివి ప్రభుత్వం తీసుకున్న ఈ చర్య సమర్థనీయమేనని పేర్కొన్నది కాంగ్రెస్ పార్టీ. దీనివల్ల పాలస్తీనా ప్రజల పట్ల భారత దేశ

కొరవ 8 పేజిలో



ప్లీనరీ ప్రాంగణంలో ప్రధాని పి.వి. ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి

## నెల్లూరు దాటుచ్ఛలిస్తే
## విమర్శకుడు

### తిరుపతి ఛలో !

ఆనాడు నేతాజీ తన సైన్యం చేత ఢిల్లీ ఛలో అంటూ యుద్ధ భేరి మ్రోగించారు; ఈనాడు కాంగ్రెస్ నాయకులు తిరుపతి ఛలో అంటూ తమ అనుచరుల చేత వినిపింప జేస్తున్నారు. ఆనాడు 'జైహింద్' అనే పత్రిక పూరిత విన్యాసపు శంఖనాదంతో స్వాతంత్ర్య పిపాస రక్తంలోని ప్రతి అణువులోనూ పరవళ్లు త్రొక్కేట్లు చేసారు; ఈనాడు చిన్న పెద్ద తమ నాయకుల నామధేయ జిందాబాద్ కేకలతో బస్సులను బారులు దీర నడిపిస్తున్నారు. అప్పటి దేశ భక్తులకు అది తారకమంత్రం; నేటి స్వార్థ భక్తులకు, ఇది బ్రతుకు మంత్రం. ఆ రోజులు, ఆ మనుషులు, ఆ విలువలు వేరు; ఈ రోజులు, ఈ మనుషులు, ఈ విలువలు వేరు. ఆ కాలము, ఆ పరిస్థితులు, ఆ వాతావరణము వేరు; ఈ కాలము, ఈ పరిస్థితులు, ఈ వాతావరణము వేరు. ఆనాటి స్వచ్ఛమైన నీరు గాలి, వెలుతురు, వస్తువులు ఈనాడు రమ్మంటే ఎక్కడి నుండి వస్తాయి? ఎప్పటి కేది ప్రస్తుతమో అదే అనుసరణీయం; నాటిని నేటితో పోల్చడం అవివేకం.

ఈ యువతరం మన రాష్ట్రంలో కాంగ్రెస్ మహాసభ జరగడాన్ని ఎప్పుడు చూచింది? మన జిల్లాకు అందు బాటైన ప్రదేశంలో ఎప్పుడు జరిగింది? నెల్లూరు యువకులకు దగ్గరగా అంత పెద్ద కాంగ్రెస్ వేదికను చూచే అవకాశం ఎప్పుడు దొరికింది? అన్నిటి కంటె ముఖ్యంగా చిల్లి గవ్వ ఖర్చు లేకుండా దర్శించే భాగ్యం ఎప్పుడు కలిగింది? – లేదు, లేదు, లేదు; అందువల్లనే ఆ అపూర్వావకాశాన్ని ఈసారి మన వారు అత్యంత వుత్సాహంగా, వుద్వేగంగా వినియోగించు కున్నారు. 15 తేది ఉదయం జీజీ వినాద లిఖితమైన త్రివర్ణ శోభిత తోరణాలను అలంకరించుకొని పచ్చని కొంకాయ ఆకులు కట్టుకొని వియోజిక వర్గాల పూర్ణ పేర్లు వ్రాసుకొని ఎర్రబస్సులు సింహపురి రాజవీధిన ఒకదాని వెంట ఒకటిగా పరుగులు తీస్తూ పోయాయి. ఒకటా రెండా, ఒక చోటా ఒక ప్రదేశమా ? ఎన్నని లెక్క బెట్టగలం? ఎన్నని జ్ఞాపకం వుంచు కోగలం? ప్రభుభక్తి ప్రదర్శనకు సమయము మించినన్ దొరకదు అన్నట్లుగా తరలిపోయారు బస్సుల నిండా జనం. నేత్రోత్సవం కల్గించిన దృశ్యమది!

ఒక్కరోజు ప్రయాణీకులకు అసౌకర్యం కావచ్చు; నెల్లూరు పౌరులు కూడా కొంత ఇబ్బంది పడి వుండవచ్చు. అరుదైన ఆ మహాసభల కోసం ఆ మాత్రం ఇబ్బందికి గురి చెయ్యడంలో తప్పు లేదు. తిరుపతిలో గణనీయమైన నెల్లూరు ప్రాతినిధ్యానికి ఎంతో సంతోషంగా వుంది.

### 'సీనియర్ అడ్వొకేటు'

నెల్లూరీయుడైన శ్రీ ఎం.వి. రమణారెడ్డి హై కోర్టు ప్రధాన న్యాయ మూర్తి – న్యాయ మూర్తులు 'సీనియర్ అడ్వొకేటు' అనే అరుదైన పురస్కారం తో గౌరవించారు. ఈ విధంగా గౌరవింపబడిన ఎనిమిది మంది హై కోర్టు న్యాయవాదులలో మన రమణారెడ్డి గారొకరు.

శ్రీ రమణారెడ్డి చెన్నారాయుని పాళెం వాసి; న్యాయశాస్త్ర పట్టభద్రుడైన పుటినుండి హై కోర్టులో ప్రాక్టీస్ చేస్తూ, పెద్ద వారిలో ఒకరుగా గుర్తింపు పొందారు. ఇది నెల్లూరుకే గౌరవం. శ్రీ రమణా రెడ్డికి మా అభినందనాలు.

### మాగుంట సంస్థానమే మకాం పెట్టింది!

తిరుపతి ప్లినరీ విజయం వెనుక మాగుంట సుబ్బరామ రెడ్డి ఒక్కడేకాదు, వారి సంస్థానం అంతటి కృషివుంది. నిర్మాణ పనులలో పూండ్ల దశయ్య, లక్ష్మినారాయణ రెడ్డి, పంబల దగ్గర శ్రీ ప్రసన్న కుమార రెడ్డి; ఆఫీసు పనిలో ఉదయం అంకాబాబు, నాగేశ్వర రావు మొత్తం పర్యవేక్షణలో ఇంజనీరు శ్రీ రామచంద్ర రావు పడిన కష్టం కాంగ్రెస్ నాయకులు గుర్తించలేకపోయినా – కాంగ్రెస్ అభిమానులందరూ చిరకాలం గుర్తు పెట్టుకుంటారు. మూదాను గంగాధరం సంగతి సరేసరి!

ఆఖరుకు వ్యాపారం తప్ప మరొక లోకం తెలయని మాగుంట శ్రీనివాసుల రెడ్డినీ వారం పాటు పొయ్యి పెగన నిలబెట్టి మార్చిపారేశారు పద్దె పోదరుడు.

ఈ రుణాన్ని ప్రధాని ఏ రూపంలో తీర్చుకుంటారో చూడాలి! కేంద్ర మంత్రిత్వం ఒక్కటే తగిన పారితోషికమౌతుంది!

### కెనరా బ్యాంకు వివరణ

రెండు వారాల క్రితం జనవాణి శీర్షికలో రిటైర్డ్ డిఆర్ఓ శ్రీ పి. కృష్ణారావు కెనరా బ్యాంకు గురించి వ్రాసిన లేఖకు, బ్రాంచి మేనేజరు శ్రీ మాధవ కృష్ణ వివరణ పంపారు. ఒక్కరోజులో 30 లక్షల డిపాజిట్లుస్వీకరించాల్సిన పని ఒత్తిడిలో సంబంధిత ఉద్యోగి విరాకు పడివుండ వచ్చు కాని, తమ బ్యాంకు ఖాతా దారులకు సేవ చేయడంలో ఏ మాత్రం లోపం చెయడం లేదన్నది ఆయన వివరణ సారంశం!

### సంతాపం

శ్రీ చదలవాడ కృష్ణమూర్తి పత్నీ వియోగ వార్త విన్నవారందరికీ పిడుగుపాటుగానే వుంది. అంతగా అందరి హృదయాలను చూరగొన్నారు శ్రీ కృష్ణమూర్తి, విఖ్యాత కవి పండితుడు శ్రీ ముదివర్తి కొండమాచార్యులు ఏ విధంగా వగస్తున్నారో చూడండి–

"అమృగు ఎలి బాసి క్షణ కాలమైన

తార

(7వ పేజీలో)



## బహిరంగ వేలము

కాలపరిమితి దాటినప్పటికి విడిపించని పద్దులు

1) శ్రీ రామదేవ్ పాన్‌బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 9; 114, పెద్దకాపువీధి. తిరుపతి వారితాలూకు లోగా ప్రకటించిన ప్రకారము 25.3.92 తేదిన వేలము జరుగులేదు కావున 19.4.92 తేది వుదయం 10 గంటలకు. 114, పెద్దకాపువీధి. తిరుపతిలో బహిరంగ ముగా వేలము జరుపబడును.

2) శ్రీ భవాని పాన్‌బ్రోకర్సు పి.బి.యల్. నెం. 18; బజారు వీధి. కార్వేటినగరము వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని పద్దులులోగా ప్రకటించిన ప్రకారము 25.3.92 తేదిన వేలము జరుగలేదు. కావున 19.4.92 తేది మధ్యాహ్నం 4 గంటల నుండి బజారువీధి కార్వేటినగరములో బహిరంగముగా వేలము జరుపబడును.

3) పి. ఉత్తమ్ చంద్ పాన్ బ్రోకర్స్. పి.బి.యల్.నెం. 3; బజారువీధి, పాపానాయుడు పేట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 8.4.89 నుండి 15.9.92 వరకు గల విడిపించని పద్దులు 2.5.92 తేది వుదయం 10 గంటలనుండి బజారువీధి, పాపానాయుడుపేటలో బహిరంగముగా వేలము జరుపబడును.

4) మెసర్స్ కామధేను అండ్ కో. పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం. 60; 8/71బజారువీధి. తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 9.7.90 నుండి 25.12.90 తేది వరకు గల విడిపించని పద్దులు 4.5.92 తేది వుదయం 10 గంటల నుండి 8/71 బజారువీధి తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

5) యం. సాగర్ మల్ జైన్ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం.50 8/188 బజారువీధి తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.7.90 నుండి 28.12.90 తేది వరకు గల విడిపించని పద్దులు 5.5.92 తేది వుదయం 10 గంటల నుండి 8/188 బజారు వీధి. తిరుపతిలో బహిరంగముగావేలము జరుపబడును.

6) జి. నరసింగ్ లాల్ శర్మ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్.నెం. 165 ; 8/201 బజారు వీధి. తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.7.90 నుండి 27.2.91 తేది వరకు గల విడిపించని పద్దులు 6.5.92 తేది వుదయం 10 గంటల నుండి 8/201 బజారువీధి. తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

7) పా కిస్తూర చంద్ అశోక్ కుమార్ పాన్‌బ్రోకర్స్ పి.బి.యల్.నెం.200; 3 వ లైను బ్రాడీపేట గుంటూరు వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 30.9.89 నుండి 24.12.90 తేది వరకూ గల విడిపించని పద్దులు 10.5.92 తేది వుదయం 10 గంటల నుండి బ్రాడీపేట 3 వ వార్డు గుంటూరు పై అడ్రసు గలవారి అంగడిలో బహిరంగముగా వేలము జరుపబడును.

8) యం. గ్యాన్‌చంద్ జైన్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 162; 1/43 పోస్టాఫీసు వీధి, రేణిగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.7.90 నుండి 19.2.91 తేది వరకు గల విడిపించని పద్దులు 20.5.92 తేది వుదయం 10 గంటల నుండి 1/43 పోస్టాఫీసు వీధి, రేణిగుంటలో బహిరంగముగా వేలము జరుపబడును.

9) బి. కనహయలాల జైన్‌పాన్ బ్రోకర్సు పి.బి.యల్.నెం. 108 1/57 పోస్టాఫీసు వీధి. రేణిగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.10.90 నుండి 21.2.91 తేది వరకు గల విడిపించని పద్దులు 21.5.92 తేది వుదయం 10 గంటల నుండి 1/57 పోస్టాఫీసు వీధి రేణిగుంటలో బహిరంగముగా వేలము జరుపబడును.

10)పి.యస్. పరేఖ్ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం. 147 417 రాయల్ చెరువు గేట్ తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచిన పుటికి 31.5.92 తేది నుండి 20.8.90 తేది వరకు గల విడిపించని పద్దులు 23.5.92 తేది వుదయం 10 గంటల నుండి 417 రాయల్ చెరువు గేటు తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

11) మెసర్స్ హప్పు కున్వర్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 47 ; మైయిన్ రోడ్డు పాకాల వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 11.7.90 నుండి 9.5.91 తేది వరకు గల విడిపించని పద్దులు 25.5.92 తేది వుదయం 10 గంటల నుండి మైయిన్ రోడ్డు పాకాలలో పై అడ్రసు గల వారి అంగడిలో బహిరంగముగా వేలము జరుపబడును

కె.వి. రామకృష్ణారావు
ప్రభుత్వము నియమించిన వేలముదారు
11/268 సంతపేట, నెల్లూరు.

## రాజీవ్

(12 పేజీ తరువాయి)

సమావేశాలలో చురుకుగా పాల్గొన్నారు. శ్రీనివాసులు రెడ్డి గారు 15 తేది మధ్యాహ్నం వరకు వుండి పత్రికల వారి దగ్గర తిట్లు పురాణం విప్పి వెళ్ళి పోయారు.

నెల్లూరుకు సంబంధించి ఏ ఎమ్మెల్యేకూ సమావేశాలలో చెప్పుకోదగ్గ పాత్ర లభించలేదు. జానకిరాంతో సహా అందరూ అతిథుల వలె తిరగవలసి వచ్చింది. ర్యాలీకి జనసేకరణలో సివి శేషారెడ్డి ఎక్కువ కష్టపడ్డట్టున్నారు. ఆయన బస్సులు, జనం దండిగా వుండినాయి. కొందరు మాత్రం బస్‌లు వ్. జన సేకరణ వదిలేసి, తిరుపతిలో కూర్చొని పత్రికా ప్రకటనలో తాము తెచ్చిన బస్‌ల సంఖ్య ప్రకటించి ముఖ్యమంత్రి మెప్పు పొందారు.

వర్కింగ్ కమిటీ ఎన్నికలో మంత్రి శ్రీ మాదాల జానకిరాం వక్కు వంచి పనిచేశారు. వై ఎస్ వర్గీయుల ఎత్తులు చిత్తు చేయడానికి ఆయన ఎన్ని వన్నాగాలు వన్నాడో చెప్పలేము.

ఆఖరి నిముషంలో 'ఎలుగు ప్యానెల్' పేరుతో ఒక వాలితా అచ్చో కాపీలు పంచి, ఎఐసిసి ఓటర్లను అకముక పెట్టి, వైఎస్ ఓటమికి చాతుర్యం చేసి చేశారు జానకిరాం. నిజానికి ప్రధానికి ఏ ప్యానల్‌తోనూ సంబంధం లేదు! రాజకీయాలలో ఆ మాత్రం తెలివి తేటలు వుండాలి కదా!

వర్కింగ్ కమిటీ ఎన్నికల ప్రహసనం సంగతి చెప్పనే లేము. 850 ఓట్లు వేయడానికి ప్రతినిధులకు ఆరుగంటలు పట్టింది; వాటిని లెక్క పెట్టడానికి పద్దెనిమిది గంటలు పట్టింది. 15 తేది రాత్రి 12 గంటలకు ఓట్ల లెక్కింపు ప్రారంభమైతే ఫలితం వెలువడింది ప్రక్కరోజు రాత్రి 8గంటలకు!

ఓడితే ఓడారు కాని వైఎస్ రాజశేఖర రెడ్డి హఠాత్తుగా, కష్టం లేకుండా ప్లీనరీ ప్రతినిధులందరికీ పరిచితులై పోయారు. ఒక రోజు పాటు ఆయన పేరు ఆవరణమంతా ప్రతిధ్వనించింది.



## ఎఐసిసి లోనూ దొంగ ఓట్లు

ఎఐసిసి లోనూ దొంగ ఓట్లు గుర్తి, కాంగ్రెస్ సంస్కృతిని పదిలంగా పరిరక్షించారు ప్రతినిధులు. ఉత్తర భారతం ఓట్లు ఎన్ని పోలయ్యాయో కాని, తెలుగు వారిలో మాత్రం నమ్మకంగా రెండు దొంగ ఓట్లు పడ్డాయి. వాటిలో మంత్రి శ్రీ పంతం పద్మనాభంది ఒకటి; సాధారణ కార్యకర్తలు ఘరానాగా క్యూలో నిలబడి ఓటు వేస్తుంటే అభ్యంతర పెట్టిన వారు లేరు.

## సినిమా నటులకు ఎంతటి దుర్గతి?

ప్లీనరీకి హాజరైన తెలుగు నటులను పట్టించుకున్న వారే లేరు. కృష్ణ, విజయ నిర్మల, అల్లు రామలింగయ్య వంటి వారంతా సమావేశానికి హాజరై అనామకంగా వుండలేకనో ఏమో, వచ్చిన దారినే వెళ్ళి పోయారు. గ్లామర్‌తో బ్రతికే వారికి ఈ [illegible] బాధాకరమే కదా!

## సజ్జన్ కుమార్ ఎంతటి సజ్జనుడో?

ఢిల్లీ ఎంపి శ్రీ సజ్జన్ కుమార్ సజ్జనత్వం తిరుపతిలోనూ బయట పడింది. ఢిల్లీలో ఇందిరా గాంధీ హత్యానంతరం జరిగిన మారణ కాండలో ప్రధాన భూమిక ఆయనది. అందు వల్లే చుట్టూ ఐదుగురు బ్లాక్ క్యాట్ కమెండోల రక్షణతో బితుకు బితుకు మంటూ తిరుగుతుండినాడు!

అయనకు తిరుమలలో బస. తనతో పాటు, తన కమెండోలకూ భోజనం గదిలోనే పెట్టించాలని కోరారట. ఆ ఏర్పాట్లు చూసే మంత్రి శ్రీ పి. రామచంద్రా రెడ్డి సరేనని చెప్పి, ఏర్పాటు చేయలేకపోయారు. అది ఆయన్ను కల్లు త్రాగిన కోతిని చేసింది. నేరుగా మంత్రి గదిలోకి వచ్చి, సిబ్బందినంతటినీ కమెండోల చేత బయటకు పంపించి, చొక్కా పట్టుకొని కొట్టబోయాడట. రివాల్వర్‌తో బెదిరించాడట. పాపం రామచంద్రా రెడ్డి గారికి ఈ పరిణామం మ్రింగుడు పడలేదు.

అయనకు సజ్జన్ కుమార్ అని పేరు పెట్టాలని తల్లి దండ్రులకు ఎందుకు తోచిందో!

### మాకినేని మృతి

తన జీవితాన్నంతా కమ్యూనిస్టు వుద్యమానికి అంకిత మొనర్చిన సి.పి.ఎం.అగ్రనాయకుడు శ్రీ మాకినేని బసవ పున్నయ్య (78) 12 తేది పార్టీ నిర్మాణ చర్చలలో నిమగ్నమై వుండి గుండె పోటుతో అక్కడికక్కడే అసువులు బాశారు. ఆయన అంత్య క్రియలు విజయ వాడలో జరిగాయి. ఆయన ఢిల్లీలోనే వుంటుండినారు. స్వంత జిల్లా గుంటూరు.

వివిధ పార్టీలకు చెందిన పాతతరం నాయకులొకరొకరు రాలి పోతున్నారు?

## ర్యాలీ రద్దు

ఎంతో ఆర్భాటంగా ప్రచారం చేసిన 14 తేది ర్యాలి అసలు జరుగనేలేదు. జిల్లాల నుంచి వందలాది బస్సులలో వచ్చిన జనం, ఊరిబయట నిలబడిపోవలసి వచ్చింది. కనీసం రాజీవ్ సెగరేను చూసే అవకాశం కూడా లభించలేదు. తమను బస్సులెక్కించి తెచ్చిన నాయకులను నోటారా నిందిస్తూ, తమను తాము తిట్టుకుంటూ

చెప్పిన దారినే తిరిగి వెళ్లారు. అనేక వేసవి శకటాలా దండగైనాయి.

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

లేనినాదనురాగ నర్తిన్ద్ర చిత్తు
తే విధాన కృష్ణుండు, పతివియోగ
వనధి దాటంగ గలడంచువగతునేను"

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | | |
| | 9672 పాతవి | 3500/- |
| | 9672 కొత్తవి | 2700/- |
| | 9674 పాతవి | 3800/- |
| | 9674 కొత్తవి | 3000/- |
| ఐ.ఆర్.20 | | 2600/- |
| మొలగొలకు బియ్యం 70 కి | | 520/- |
| బంగారు సవర (8గ్రా) | | 3750/- |
| వెండి 10 గ్రా | | 90/- |


జమీన్‌రైతు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 75.00 |
| ఆరు నెలలకు | రూ 40.00 |

## ప్రకటన

ఇందు మూలముగ తెలియజేయడమేమనగా, ఈ క్రింది వివరించిన షెడ్యూలు భూముల గురించి, తగాదా వ్యవహారము, ఆంధ్రప్రదేశ్ హై కోర్టులో W.P.No.6253/90 విచారణలో నున్నది. మరియు నాకు ( దువ్వూరు జయరామి రెడ్డి) W.P. M.P. 8210/90 లో స్టే జారీ చేసియున్నారు.

ఈ భూములు గూడూరు డిస్ట్రిక్టు మునసబు కోర్టులో గూడా O.S. No. 38/90 దావాలో విచారణలో నున్నవి.

ఇది గాక సదరు భూముల తగాదా గూడూరు సబ్ కోర్టులో O.S. 105/87 దావాలో విచారణలో నున్నది.

అదియును గాక యీ తగాదా పరిష్కార నిమిత్తము భారత సుప్రీం కోర్టులో గూడా విచారణలో నున్నది.

ఈ దావాలో షెడ్యూలు భూములను నెల్లూరు పల్లి, గ్రామ కాపురస్తుడు, చెంచురెడ్డి కుమారుడు అల్లూరు నాగిరెడ్డి, తనుగాని, తమ పవర్ ఆఫ్ అటార్నీ, గంగపట్నం దశరధ రామి రెడ్డి ద్వారా విక్రయించుటకు ప్రయత్నించు చున్నారు. సదరు విక్రయములపై దావాలో పరిష్కారము కాకుండా చెల్లనేరవని ఇందు మూలముగా తెలియజేయడమైనది.

## షెడ్యూలు

నెల్లూరు జిల్లా, గూడూరు సబ్ రిజిస్ట్రేషన్, గూడూరు టౌను, పడమర గూడూరు, W2-34; S.No. 595, 596, 597, 598, లలో Ac. 2-75 సెంట్లు లేక 1650 అంకణములు, హద్దులు. తూ: పోలారెడ్డి వగైరాల యిండ్లు; ద: దువ్వూరు జయరామిరెడ్డి యిల్లు, ఆవరణము; ప: పంట భూములు; ఉ: అల్లూరు ఆదిశేషారెడ్డి రెడ్డి వగైరాల స్థలము.

**దువ్వూరు జయరామి రెడ్డి**
జయమేష్టన్నం, వరశింగరావుపేట,
గూడూరు, నెల్లూరు జిల్లా



# శివారెడ్డి పద్యాలు

### గిన్నెభిక్ష (లేగుంటపాడు)

చిన్నచిరణ గారు శ్రీరామచంద్రుడు
గిన్నె భిక్ష ఎంత చిన్నతనము
మమ్ముకని లేవు మానాభిమానాలు.
దేశ నాయకులకు దేవతలకు!

దొంగలిస్తె తప్పు దోచుకుంటెతప్పు
అడిగి తీసుకుంటె ఆశయిస్తె
తప్పుగాదు దాని తరచేందుకిల్లేరు;
కలము పూరుకోదు కలిబెరతరి!

అంతరంత జేసి ఏదిదో వ్రాస్తుంట
దాక బరుతుంట బరుగుకవివి
తప్పుగా దీన్ని తలబెట్టబాకండి!
పళ్ళు కొరకకండి పాఠకులారా!

### ముసలితనం

నాకు తెలియకుండ నన్నెత్తికెగసింది
ముసలితనము దీని ముంద మియ్య
బయట రావాలంటె బాధకరంగుంది
లోటుగుంది సిగ్గు చేటుగుంది!

### కాంగ్రెసు మహాసభ

కోట్లు కోట్లు దెచ్చి క్రుమ్మరిస్తున్నారు
ఎండా, వానలనక చెర్మ మీద
వీతి విప్పనేర్పి నిను పైకి దెచ్చింది
కాంగిరేసు. ముప్పి ఖర్చుదేంది!

కర్తిలేని వచ్చి కాంగ్రెసు ఈ శివా
రెడ్డి, లాభమేమి చెర్త సైము
కాంగిరేసు సభకు కవి తిరుపతికి బోల
హెల్తు స్పాయిలైంది యింతలోనె

## సణుగుడు

4 పేజి తరువాయి

మాదిరి మేకప్ వేసుకొని డ్యూయెట్లు పాడడంలో, డిష్యుం డిష్యుం ఫైట్లు వేయడంలో అనుభవం లేకపోయినా; మేకప్ అవసరం లేకుండా సమయ సంద ర్భాలను బట్టి ముఖకవళికలను మార్చడంలో ఊసర వెల్లుల కంటె వేగంగా రంగులు మార్చడంలో, ఆత్రేయ, ఆరుద్రుల కంటె మిన్నయిన రీతిలో డైలాగులు తామే రచించుకొని వల్లించడంలో, వేదికెక్కి హావభావ ప్రదర్శనలు చేయడంలో, కాంగ్రెస్ వాదులు ఏ సినిమా నటుడికి తీసిపోరు. వారికుండే అనర్హతల్లాతలకు బెలుకుల ప్రదర్శనా వైఫల్యమే. ప్లీనరీ సమావేశం ద్వారా యావద్భారత ప్రజానీకానికి తాము సకల కళా ప్రదర్శనాలతో సినిమా నటులకు సరితూగే వారిమే నని నిరూపించుకునే మహద్భాగ్యం కాంగ్రెస్ వాదులకు లభిస్తున్నది. వారంత మంచి బుద్ధితో తెబ్బయ్ లక్షలు పెట్టి స్వాగత తోరణాన్ని, ఒక్కొక్కటి మూడేసి లక్షలతో మూడు పదులు స్వాగత ద్వారాలను ఏనుగుల బొమ్మలను, స్త్రీ మూర్తుల శిల్పాలను అందంగా చెక్కించి అలంకరిస్తే – ఎందుకింత ఆడంబరం, వృథా అంటూ తప్పు లెన్నడం మన తప్పు కాదా?

ప్లీనరీకి హాజరయ్యే నాయకులు చిన్న చితకా వారా? ముఖ్యమంత్రులు, మాజీ ముఖ్యమంత్రులు, కేంద్ర మంత్రులు, పార్టీలో బిగ్‌బిగ్ బాసులు కోట్ల కోట్ల ప్రజాధనాన్ని పటిక బెల్లంగా తిని ఆ బరువు మోయలేక, అరిగించుకోలేక బాధపడే పొట్టలతో భారంగా కదలి వచ్చే, క్వింటాళ్ళ బరువు తూగే భారీ కాయాల్తో, ఏసి గదిని వదలకుండా, ఇంపోర్టెడ్ కారు దిగకుండా, హెలికాప్టర్లను వీడకుండా ప్రజాసేవ చేసే, ఐదేళ్ళ కొకసారి ఎన్నికల్లో మాత్రం ముక్కుమూసుకొనో, చిదరను అణచుకొనో, సర్వసుఖాలూ త్యాగం చేసి ఎర్రటి ఎండలోనూ దుమ్ములేచె రోడ్లను లెక్కచేయకుండా మన దగ్గరకు వచ్చి ఓట్ల భిక్ష నర్థించే త్యాగధనులు; సిమెంట్ కుంభకోణంలోనో, విదేశీ ఆయుధాల గోల్మాల్‌లోనో కష్టపడి అర్జించిన నోట్ల కట్టలను ఓటర్లకు ఉదారంగా పంచిపెట్టె నిస్వార్థపరులు ఎందరెందరో దేశ సేవా తత్పరులై, దేశానికి ఏ రూపంలో సేవచేస్తె బాగుంటుందో చర్చించే మహదాశయంతో వస్తున్నపుడు –గుంటలు పడిన రోడ్లను, ఏసిలు లేని గెస్ట్‌హౌస్‌లను ఎన్టిడి లేని హోటల్ గదులను అట్లనే వుంచడం మహా పాపం కాదా? పాతిక లక్షలు పెట్టి ప్రధాని పదిగంటలు గడిపే బంగళాను రిపేరు చేసినా, మూడు కోట్లు ఖర్చుపెట్టి మున్నటి తారు రోడ్లను తీర్చిదిద్దినా, గెస్ట్ హౌస్‌లలో కాశ్మీర్ తివాచీలు పరిచినా, పట్టుపరదాలు వేలాడదీసినా, విటి కంతా ప్రభుత్వ ధనాన్ని ఖర్చు పెట్టినా – ప్రశ్నించే హక్కు మనకుందా? పన్నులు కట్టేది మనమే కావచ్చు కాని, కట్టించుకునేది వారే కాదా? మనం కట్టే పన్నుల సొమ్ము భద్రంగా కాపాడాలంటె, అది హరిజనుల ఇళ్ళకో, గిరిజనుల బర్రెలకో దండగ కాకుండా జాగ్రత్తగా తమ ఇళ్ళలోని ఇనప్పెట్టెలకు తరలించాలనా ఒక్కొక్క నాయకుడు ఎంత శ్రమపడాలి? ఎన్నెన్ని ఆలోచనలు చేయాలి? ఎన్ని విధాలుగా ఎందరి కళ్ళు కప్పాలి? మరి అంతటి శ్రామికులకు ఆమాత్రం "కనీస" సౌకర్యాలు కల్పించడంలో వింతే ముంది?

పదివేల మంది ప్రతినిధులకు పదిహేను వేల మంది పోలీసులను రక్షణగా నియమించడం పెద్ద నేరంగా ప్రచారం చేస్తున్నారు. ఈ దేశంలో పెద్ద దొంగలు రాజకీయ నాయకులే! దొంగలంతా ముఠాగా ఏర్పడి, వంద బస్సులు దోచుకున్న వారికి దొరికేది మహా అయితే లక్ష లేదా రెండు లక్షలు. ఎన్ని ఇళ్లు కొల్ల గొడితే ఒక దోపిడి ముఠాకు కోటి రూపాయలు దొరుకుతాయి? ఏ ముఖ్యమంత్రో, మంత్రివర్యులో ఒకే ఒక్క సంతకం పెట్టడం ద్వారా కోట్లు కొల్లగొట్టగలరు. ప్రజలను ఎన్ని విధాల దోచుకోవచ్చు అనే విద్యలో మాస్టర్ డిగ్రీలు, పిహెచ్‌డి టైట్లు పొందిన పదివేల మంది నిజమైన దొంగలు ఒక చోట చేరినపుడు వారిని ఊరకే వదిలేస్తే, ఎంతటి దారుణ దోపిడీ పథకాలు తయారయ్యే ప్రమాదం వుందో ఊహించండి. వారు ప్రజలతో కలిస్తే, వారి విద్యలన్నీ మనకు వంటబట్టి మనమూ ఆ ధోరణిలో వ్యవహరించే డేంజర్ వుంది కదా? అందుకే పాపం నాయకులు తమకు, ప్రజలకు మధ్య పోలీసుల తెరను అడ్డంగాదించి ప్రజాసేవ చేయ సంకల్పిస్తారెప్పుడు. వారంత మంచి బుద్ధితో మన నుంచి దూరంగా తొలగి పోతుంటె మనం అభ్యంతరం చెప్పడం ఏమి న్యాయం చెప్పండి? ఈ దేశంలో నాయకులు ఎంత దూరంగా వుంటె ప్రజలకు అంత మేలు. అందుకే ప్లీనరీ బందోబస్తు గురించి ఎవరూ దిగులు చెందనవసరం లేదు.

## స్తోత్రపాఠాలు

(5 పేజి తరువాయి)

సంఘీ భావానికి లోటు రాదనే అభిప్రాయపడ్డారీ తీర్మానంలో! దేశంలో తీవ్రవాదం ప్రోత్సహించడానికి పాకిస్తాన్ కుట్రలు పన్నుతూ వున్నప్పటికీ, ఆ దేశంతో చెలిమి నెరపడానికి, శాంతి స్థాపించడానికి కృషి చేయాలని తీర్మా నించారు. ప్రభుత్వం అమెరికా పట్ల వ్యవహరిస్తున్న తీరు అలీన విధానానికి భంగకరం కాదనే అభిప్రాయపడ్డారు.

దేశం ప్రస్తుతం ఎదుర్కొం టున్న పరిస్థితులన్నింటినీ ఈ మూడు తీర్మానాలో విపులంగా ప్రస్తావించినప్పటికీ వాటిపై పార్టీ ప్రతినిధుల అభిప్రాయాలు వినడానికి, విధానాల బాగోగులను చర్చించడానికి పెద్ద ఆసక్తి ప్రదర్శించలేదు. ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు మాత్రం, పాఠం చెప్పే అయ్యవారి వలె ఈ మూడు తీర్మానాలనూ సమర్థిస్తూ సుదీర్ఘ ప్రసంగాలు చేశారు. మేధా సంపత్తితో, విషయ పరిజ్ఞానంతో ఆయన తన ప్రభుత్వ విధానాలు ప్రజలకు దేశానికి ఎంతటి మేలు చేస్తామొ నచ్చ చెప్పారు.

రాజకీయ వాదులలో ప్రమాణాల పతనం పట్ల తీవ్ర ఆందోళన వ్యక్తం చేశారాయన. రాజకీయ వాదులు రాజకీయ సమస్యలను ప్రక్కన పెట్టి, దేవాలయం పేరుతోనే, మసీదు పేరుతోనే రాజకీయం చేయచూడడం వల్లనే దేశంలో ఈనాటి పరిస్థితి ఏర్పడిందని, రాజకీయ పోరాటం చేయలేని వారు రాజకీయాలు వదిలేసి వెళ్ళి పోవాలని అన్నారు పివి.

ఆర్థిక విషయాలపై తన విధానాల సమర్థనకు చాలా శ్రమ పడ్డారు పివి. పబ్లిక్ రంగ ప్రాధాన్యత తగ్గించడం దేశ హితం కోసమేనన్నది ఆయన వాదన. ఏ ప్రభుత్వమైనా బడ్జెట్‌లో నిధుల కొరత ఏర్పడితే ముందుగా విద్య, వైద్య రంగాలకు కోత పెడుతుంది. దీని ఫలితమే, ఈ రోజు నిరక్షరాసులు అత్యధికంగా వున్న, దేశంగా ప్రపంచంలో మన మెదుర్కొంటున్నఅవహేళన. 5 వేల కోట్లు పెట్టి ఒక భారీ పరిశ్రమ పెట్టే కంటె, ఆ నిధులతో వేలాది స్కూళ్లు, ఆస్పత్రులు పెట్టడం సంక్షేమ ప్రభుత్వం చేయవలసిన పని అన్నారాయన. దేశాల మధ్య దూరం తగ్గిపోయి, ప్రపంచ పోయి ఒక గ్రామంగా మారిపోతున్నప్పుడు భారతదేశం మాత్రం ప్రపంచ ధోరణులు విడనాడి ఉలిపి కట్టెగా బ్రతకాలను కోవడం వ్యర్థం అన్నారు పివి.

మణిశంకర్ అయ్యర్ వంటి వారు ఒకరిద్దరు తప్ప, మాట్లాడిన వక్తలెవరూ తీర్మానాలపై చర్చ ప్రేరేపించడానికి ప్రయత్నించలేదు. పివిని, సోనియా గాంధీని పొగడడానికే వారికి సమయం చాలలేదు. రత్నాకర పాండే వంటి వారు పివిని భగవంతుడి అవతారంగా పొగిడి తమ మానసిక దైన్యాన్ని బయట పెట్టుకున్నారు. ప్లీనరీ వేదికను బహిరంగ సభగా మార్చి ఊకదంపుడు ప్రసంగాలతో, స్తోత్ర పాఠాలతో వినుగెత్తించారు. ఈ విసుగు భరించలేక ప్రతినిధులు లేచిపోవడంతో అధిక వ్యయం భారీ ఖర్చులతో ప్యాక్టరీ పేలవంగా తయారైంది.

విదేశీ వ్యవహారాలపై మణి శంకర అయ్యర్ చేసిన ప్రసంగం మాత్రం అద్వితీయమైనది. వేల సంవత్సరాల భారత చరిత్ర, సంస్కృతి, మారుతున్న ప్రపంచంలో భారతదేశం స్థానం వంటి వాటిపై విజ్ఞానదాయక ప్రసంగం చేశారాయన. అమెరికా నుంచి పది డాలర్లు, జపాన్ నుంచి ఐరవై ఎన్‌లు ఎక్కువ అప్పు తెచ్చుకోవడాని కనుకూలంగా మన విదేశాంగ విధానాన్ని మల్చడం పట్ల నిర్మొగమాటంగా తన నిరసన వ్యక్తం చేశారు మణి. భారత దేశానికున్న చారిత్రక, సాంస్కృతిక సంపద ఆధారంగా; భిన్నత్వంలో ఏకత్వం సాధించడం పట్ల భారతదేశం తరతరాల నుంచి ప్రదర్శిస్తున్న విజ్ఞత ఆధారంగా వసుధైక కుటుంబం స్థాపనకు భారత దేశాని యావత్ప్రపంచం ఒక నమూనాగా తీసుకొనే ధోరణిలో మన విదేశాంగ విధానం వుండాలన్నారు.

తీర్మానాలపై ప్రసంగించే అవకాశం కేవలం ముగ్గురు తెలుగు వారికే లభించింది. ద్రోణం రాజు సత్యనారాయణ, పాలడుగు వెంకట్రావు, కె. రోశయ్యలు మాట్లాడారు. వారూ స్తోత్ర పాఠ పఠనంలో తామెవ్వరికీ తీసిపోమని నిరూపించుకున్నారు.

## జనవాణి

3 పేజి తరువాయి

వున్న రోజులలోనే ఎంతో ఉన్నత చదువులు చదివి, మేధావిగా పెరిగి, భారత రాజ్యాంగ రచనలోని భాగం పంచుకొన్న అంబేద్కర్ ఘనతను ఊరకే పొగిడితే సరిపోదు; ఆశయాలను ఆచరణలో పెట్టి, చదువు సాముల ప్రతి హరిజనుడూ వృద్ధిలోకి వచ్చినపుడే హరిజనుల అభ్యున్నతి. కనీసం యువతరం హరిజనులైన ఈ వాస్తవం గుర్తించాలి!

– ఎండ్లూరి అరవింద బాబు
అధ్యక్షుడు
ఎస్‌సి, ఎస్‌టి యూత్ వెల్ఫేర్ అసోసియేషన్

## పంచాంగం

తేది 18 శనివారం ఉదయం 8.02 గంటలకు వృషభలగ్నము వివాహ గృహారంభ వ్యాపారములకు

తేది 24 శుక్రవారం ఉదయం 5.00 గంటలకు గృహారంభ వివాహములు మీనలగ్నం.

### ఏప్రెల్ తిథులు

చైత్రబహుళ

| | | | | | |
|---|---|---|---|---|---|
| తే 18 | శని | పాడ్యమి | ఉ.గ. 9.20 | వ |
| తే 19 | ఆది | విదియ | ఉ.గ. 8.47 | వ |
| తే 20 | సోమ | తదియ | ఉ.గ. 8.45 | వ |
| తే 21 | మంగళ | చతుర్థి | ఉ.గ. 9.15 | వ |
| తే 22 | బుధ | పంచమి | ఉ.గ. 10.10 | వ |
| తే 23 | గురు | షష్ఠి | ఉ.గ. 11.20 | వ |
| తే 24 | శుక్ర | సప్తమి | ఉ.గ. 1.20 | వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ


**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 75.00 |
| ఆరు నెలలకు | రూ. 40.00 |
| విడి ప్రతి | రూ. 1.50 |

# ఈ వయసులో కాలేజి కుర్రాడిలా ఎగరాలా ?

"వయసనేది ఎంత ముఖ్యమో – అది వయసుతో సంబంధం లేదని చెప్పడమే ముఖ్యోద్దేశం" అన్నారు శరత్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఏ. బలరాం నిర్మించే సై చిత్రంలో అక్కినేని నటిస్తున్నారు. వయసు పై బడినా చదువుకోవాలనే కుతూహలం కొద్దీ కాలేజిలో చేరి, విద్యార్థులతో కలిసి చదరాబుల్లోడులా నృత్యాలు, అల్లరి చేస్తారట. ఈ పాత్ర నిర్వహణ కోసం అక్కినేని ఆహారాన్ని తగ్గించి, వ్యాయామం చేసి మరింత చలాకీగా

## అక్కినేనికి ఎందుకీ ఆరాటం ?

తయారయ్యారట. రాధిక, హరీష్, జీనత్, యమున, వై.విజయ, దిస్కోశాంతి, రాజ్‌కుమార్, సత్యనారాయణ, తనికెళ్ళ భరణి, బ్రహ్మానందం, బాబూ మోహన్, నర్రా, భీమేశ్వర రావు, పాత్రధారులు. కాట్రగడ్డ ప్రసాద్ నిర్మాణ సారథి.

## నెల్లూరీయుల చిత్రంలో మోహన్ బాబు

ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో "ఖైదీ, వేట, మహాసంగ్రామం" చిత్రాలను నిర్మించిన సంయుక్త మూవీస్ అనుబంధ సంస్థ శ్రీ సాయి శాంతి ఫిలిమ్స్ 'సుష్మ' సమర్పణలో సినిమా స్కోప్‌లో నిర్మించే చిత్రానికి "తాలాట్టు కేక్కుదమ్మా" అనే తమిళ హిట్ చిత్రం ఆధారం. మోహన్‌బాబు, దివ్యభారతి నాయకా నాయికలు. రచన: పరుచూరి బ్రదర్స్. సంగీతం: కీరవాణి, ఛాయ: ఎం.వి.రఘు. జూలైలో షూటింగ్ ప్రారంభమవుతుందని నిర్మాత శ్రీధరరెడ్డి తెలిపారు.



శౌర్యచక్రలో శోభన, రాజ్‌కుమార్

# నాగార్జున రక్షణకు మాతృసంస్థ కంకణం ?

నాగార్జునకు మరో రెండు హిట్ పిక్చర్లు దక్కితే గాని నిలదొక్కుకోలేరు. ఈ రక్షణను మాతృసంస్థ స్వీకరించింది. ఉప్పలపాటి నారాయణ రావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వెంకట్ అక్కినేని నిర్మిస్తున్న "రక్షణ" చిత్రంలో శోభన నాయిక. కోట శ్రీనివాస రావు, నాజర్, పరేష్‌రావెల్, బ్రహ్మానందం, విజయ కుమార్, నటుడు జగపతిబాబు కుమార్తె బేబీ మేఘన నటిస్తున్నారు. సంగీతం: కీరవాణి, సమర్పణ: శ్రీమతి అన్నపూర్ణ, ఇందులో హీరో పోలీస్ అసిస్టెంట్ కమీషనర్.

## అసాధ్యురాలు

డాక్టర్ భానుమతీ రామకృష్ణ చిత్రం "అసాధ్యురాలు" ఏప్రెల్ నెలాఖరుకు షూటింగ్ పూర్తి అవుతుంది.

"మేధస్సులోనూ, ధైర్యసాహసాలలోనూ మగవారికన్నా మగువలు ఏ మాత్రం తీసిపోరని చాటి చెప్పే కథాంశం. సెంటిమెంట్‌తో పాటు హాస్యం, యాక్షన్ సమపాళ్ళలో ఉంటాయి గనుక అన్ని తరగతుల ప్రేక్షకులనూ విశేషంగా ఆకర్షించగలదని ఘంటాపథంగా చెప్పగలను. ఈ చిత్రం ద్వారా నేను పరిచయం చేస్తున్న హీరోలు శ్యామ్, విజయ్ ఎంతో అనుభవజ్ఞుల్లా నటించారు. వారి సరసన నటించిన నందిని, ధార్మిక ప్రేక్షకులను ముగ్ధులను గావిస్తారు. ఈ రెండు జంటల పై వి.జి.పి గార్డెన్‌లో చిత్రీకరించిన రెండు పాటలు ఎంతో కమనీయంగా ఉంటాయి. ఇళయరాజా సమకూర్చిన మధురమైన సంగీతం గురించి ఎంత చెప్పినా చాలదు. గూడూరు, నెల్లూరు, ఒంగోలు, పరిసరాలలో ఏప్రెల్ నెలాఖరుకు షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు భానుమతీ రామకృష్ణ. ఈమె కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో పాటు ప్రధానపాత్ర నిర్వహిస్తున్న భరణీ ప్రొడక్షన్స్ "అసాధ్యురాలు" చిత్రంలో ప్రశాంతి, రేణు, తాతినేని రాజేశ్వరి, శివం, నెపోలియన్ ప్రభృతులు ఇతర పాత్రలు నిర్వహించారు.

# తెరమీద మళ్ళీ నాగభూషణం !

'రక్తకన్నీరు' నాగభూషణం సినిమా రంగం నుంచి నివృత్తి పొందకుండా ఉంటే, ఇప్పటి కేరెక్టర్ ఆక్టర్‌లు చాలా మంది ఎక్కడ వుండే వారో? కొన్ని పాత్రలు నాగభూషణంలాంటి వారు చేస్తేనే రక్తికడ్తాయి. అందుకని రచయిత త్రిపురనేని మహారథి ఆయన పుత్రుడు చిట్టి దర్శకత్వంలో నిర్మిస్తున్న "రైతు భారతం" చిత్రంలో ఒక క్లిష్టమైన పాత్ర ఇచ్చారు. నాగభూషణం నుంచి ఇప్పటి సినిమా నటులు నేర్చుకోవలసింది ఎంతో ఉంది.

## ఏప్రెల్ 23 న భార్గవ్ ఆర్ట్స్ "అల్లరి పిల్ల"

భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ ఎస్. గోపాలరెడ్డికి ప్రజల నాడి తెలుసు. వసూళ్ళలో (కేరళలో) రికార్డు సృష్టించిన "కిలుక్కం" మలయాళ చిత్రం ఆధారంగా కోడి రామకృష్ణ దర్శకత్వంలో తిరుపతి పరిసరాలలో 35 రోజులలో చిత్రీకరించిన "అల్లరిపిల్ల" చిత్రం ఏప్రెల్ 23 న విడుదలవుతుంది. గైడ్‌గా సురేష్ నటించగా పారిపోయి వచ్చి అతనికి తిరుపతిలో తటస్థ పడ్డ 'అల్లరిపిల్ల'గా మీనా నటించింది. అనేక మలుపులతో ఆద్యంతం ఆకట్టుకునే ఈ చిత్రంలో సత్యనారాయణ, చిన్నా, ఈశ్వర రావు, జగ్గు ఇతర పాత్రధారులు. మాటలు: గణేష్ పాత్రో, పాటలు: వెన్నెలకంటి.

## అందరూ హాస్యనటులే– కాని చిత్రం మాత్రం అపహాస్యం

# డబ్బు భలే జబ్బు

చిత్రసమీక్ష

గిద్దలూరు గోపాలరావు

డబ్బు మనిషికి ఎన్ని అవసరాలను తీరుస్తుందో, అన్ని సమస్యలనూ సృష్టిస్తుంది. డబ్బు సంపాదన కోసం మనిషి చేసే ప్రయత్నాలు, మోసాలు, పెద్ద పనులు కోకొల్లలు. కోటికి పడగలెత్తినా ఇంకా డబ్బు సంపాదించాలనే జబ్బు చాలా మందిలో వుంటుంది. డబ్బు సంపాదనలో బంధుత్వాలు, రక్త సంబంధాలు, ఆప్యాయతలు అన్నీ మరుగున పడిపోతాయి. హాస్యనటుడు అల్లు రామలింగయ్య నిర్మించిన "డబ్బు భలే జబ్బు" చిత్రంలో కొడుకులు, కోడళ్ళు తల్లిదండ్రుల ఆస్తి పాస్తులు లాక్కొని వారిని అనాధలుగా చేసే జబ్బు చూపబడింది. ఈ కోవకు చెందిన చిత్రాలు ఇది వరకు చాలా వచ్చాయి. ఈ పాత ఇతివృత్తాన్ని కొంత వరకైనా కొత్తరకంగా చూపే ప్రయత్నం జరగలేదు. చిత్రంలో ఈ అంశం మీదా దర్శకుడు కె.యస్. రాజేంద్ర ఏమాత్రమూ శ్రద్ధ తీసుకున్నట్లు లేదు. అందువల్ల కథనంలో చాలా కృత్రిమత్వం చోటు చేసుకుంది. చూస్తున్నంత సేపు విసుగనిపిస్తుంది.

అల్లురామలింగయ్య, గొల్లపూడి మారుతీరావు, రావుగోపాలరావు, బ్రహ్మానందం లాంటి హాస్యనటులుండి గూడా తమ హాస్యం ద్వారా చిత్రంలో విసుగును పోగొట్టలేక పోయారు. వారి పాత్రలు సృష్టి ఆ పాత్రల్లో వారి నటన తీరు అంత దౌర్భాగ్యంగా వుందన్నమాట. కనీసం సంగీతమైనా కాస్త ఆనంద పరుస్తుందనుకుంటే గంగై అమరన్ సంగీతం చప్పగా తయారైంది. వెన్నెలకంటి వ్రాసిన పాటలు బాగున్నా చప్పని సంగీతం పుణ్యాన సోదిలోకి రాకుండా పోయాయి. గణేష్ పాత్రో మాటలు కొంత ఉపశమనం కలిగిస్తాయి.

ఈ సినిమా కథ విసు వ్రాశారు. ఆయన ఒక తమిళ రచయిత, దర్శకుడు. అందువల్లే కథ ఏదో ఒక తమిళ చిత్రం అనుకరణగా వుంది. ఇది మూడుకుటుంబాల కథ. ఒక కుటుంబం కుటుంబరావుది (గొల్లపూడి) ఈ కుటుంబంలోని కొడుకులు, భార్యల మాటలు విని ముసలి తల్లిదండ్రుల ఆస్తిపాస్తులను ఏవేవో అవసరాలు చూపి స్వాధీనం చేసుకొని, తల్లిదండ్రులను ఇంటికి గూడా లేకుండా చేస్తారు.

కొరవ 10 పేజిలో

## పినాకినీ తీరం

(2 పేజి కొరవ)

వుండేవి చిత్రాల పేర్లు. అప్పుడు మంచివి కొన్నైనా వుండకపోవడం లేదు; కాని చాల తక్కువ. 'దాసి' చిత్రం ఎన్నో బహుమతులందుకుంది; హిందు వంటి పత్రికలు కూడా ఆకాశానికెత్తేశాయి. ఎంతో ఔత్సుక్యంకను కల్గించాయి. కాని ఆ పిక్చరు సామాన్య ప్రేక్షకుల మధ్యకు రాలేదు. అది యాదార్థ గాథ అన్నారు. ఇది వరకెప్పుడో ఇదే పేరుతో ఒక చిత్రం విడుదలైనట్లు గుర్తు. సాగదీస్తే పాత కొత్త చిత్రాల పేర్లకు అంతం వుండదు.

నేను సినిమా జీవిని కాదు. కాని "అంతే కావాలి!" పేరుతో ఎప్పుడో వచ్చిన ఒక చిత్రం నా స్మృతిలో వుంది. చిత్రం నాలుగు రోజులు ఆడకపోయినా ఆ పేరు నన్ను ఆకర్షించింది; ఈనాటికీ జ్ఞాపకం వుంది. నేటి పరిస్థితులకు అతికినట్లుగా అద్దం పట్టినట్లుగా వున్న అటువంటి ఒక టైటిల్ 'డబ్బు భలే జబ్బు'. నేను చిత్రం చూడలేదు; కథ తెలియదు; వాల్‌పోస్టర్‌లలో కనపడే పేరుతప్ప మరేమి తెలియదు. ఇంత చక్కగా ఇంత వాస్తవికంగా నేటి పరిస్థితులకు ఇంత అనుగుణంగా ఆ చిత్రానికి పేరు పెట్టిన ఆ వ్యక్తులను అభినందిస్తున్నాను చిత్రం బాగోగుల పరిశీలన జమీన్‌రైతు వరకు గ్రిగోరా గుత్త సొత్తు!

ధన మూలం ఇదం జగత్ అన్నారు; దాసి కొడుకైన కాసులు కలవాడే రాజు అన్నారు; డబ్బు చూస్తే కొండ మీద కోతి కూడా దిగివస్తుందన్నారు; రాజును చూచిన కంట మొగుణ్ణి చూస్తే మొట్ట బుద్దేస్తుందన్నారు...... కవి పండితులైతే ఇటువంటి సుదువులు ఎన్నైనా వుటంకించవచ్చు. ఇవన్నీ ధన ప్రభావాన్ని చాటి చెప్పేవే. అనాది నుండి డబ్బుకున్న విలువ అటువంటిది. ఎందరో కవులు, అనుభవజ్ఞులు లోకం ధనం మీద ఆధార పడి వుందని సర్వసాధారణంగా చెప్పారు కాని, ఈ చిత్రం వారు చెప్పినట్లు డబ్బు భలే జబ్బని ఎవ్వరూ పేర్కొన లేదు. ఆ కీర్తి వీరిదే!

వాస్తవమే ఈనాడు డబ్బు పేరాశకు మించిన జబ్బు మరేముంది? ఎయిడ్స్ వ్యాధి కూడా ఇంతకంటే భయంకరమైంది కాదు. అన్ని జబ్బులకు మందులున్నాయి; వస్తున్నాయి; రాబోతున్నాయి. ఆ రంగంలో నిరంతర పరిశోధన సాగుతునే వుంది. ఈ జబ్బు నివారణకు మాత్రం మందు లేదే! కనిపెడదామని శాస్త్రజ్ఞులు అనుకోవడం లేదే! మనిషికి జబ్బు ముదిరి నివారణ దశను మించిపోతే ఆ మనిషి చస్తాడు. ఆ నష్టం అతని వరకే; అతని కుటుంబం వరకే. కాని, డబ్బు జబ్బు విషమిస్తే సమాజమే నాశనమైపోతుంది. దేశమే అధోగతిపాలౌతుంది. అంతే తేడా!

పూర్వం కోటికి పడగలెత్తడం అంటే మహా గొప్ప. ఎక్కడో ఎవడో అటువంటి కుబేరుడుండే వాడు. ఈనాడు కోటి అంటే బలాదూర్! ధనార్జన ఆశకు, తపనకు పరిమితి అంటూ లేదు. దశ, శతద్విశతకోటి మార్గంగా రేసు గుర్రాల్లా పరుగుతీస్తున్నారు. ఈ పరిస్థితుల్లో, ఈ వాతావరణంలో "డబ్బు భలే జబ్బు" అనే పేరు ఎంత చక్కగా ఎన్నుకున్నారా అనిపిస్తుంది. ఈ చిత్రాన్ని గూర్చిన నా ప్రస్తావన పేరు వరకే.

తిరుపతిలో అంత పెద్ద కాంగ్రెస్ సంబరాన్ని పెట్టుకొని, వ్యక్తిగతంగా ప్రాణప్రదమైన రాజకీయ మహాసభలను పెట్టుకొని వాటిని గూర్చి కాకుండా ఇంకా దేన్ని గూర్చో చెప్పుదంటూ వ్రాత ఏమిటి అని మీరడగక్కర్లేదు- నాకే అనిపిస్తున్నది!

నగ్న

## చేపలు

(4 పేజి కొరవ)

వ్యాధి సైతం నివారించే అవకాశం వున్నట్లు పరిశోధనలు తెల్పుతున్నాయి. గుండెపోటు, హైపర్ టెన్షన్ వంటి పలురోగాలను చేపలు తినడం ద్వారా అదుపులో వుంచుకోవచ్చు. చేపలు క్రమం తప్పకుండా తినే వారిలో డయాబెటిస్ వ్యాధి చాలా అరుదుగా కాని రాదు. అయితే చేపలను బాగా ఉడకపెట్టి వండి తినాలే తప్ప, వేయించి తినకూడదు.

### సహజ వనరుల సక్రమ వినియోగం

పంటల సాగులో భూమిపై పొర మాత్రమే ఉపయోగపడుతుంది. కాని చేపల పెంపకంలో మూడు విధాలా సహజ వనరుల సక్రమ వినియోగం జరుగుతుంది.చేపల పెంపకం వల్ల కల్గే ప్రధాన ఉపయోగం - వాతావరణకాలుష్యాన్ని వ్యాధికారకమైన సూక్ష్మ క్రిములు, పురుగులను అరికట్టగల్గడం. వంట ఇళ్ళ వ్యర్థ పదార్థాలు; బాతులు, కోళ్ళు, పందుల పెంటను చేపలకు ఆహారంగా మార్చి ఉపయోగ పెట్టుకోవచ్చు. దీనివల్ల కాలుష్యనివారణతో పాటు - చేపల కవసరమయ్యే ఆహారాన్ని చవకగా తయారు చేసుకోవచ్చు.

చేపల పెంపకాన్ని పట్టు పురుగులు, తోటలు, పాడిపరిశ్రమ, పందుల పెంపకం వంటి వాటితో కలిపి జరపవచ్చు. దీనివల్ల రైతులకు ఒకేసారి రెండు మూడు రకాలైన ఆదాయాలు వచ్చే వీలుంది. చేపలను పెంచడానికి సింథటిక్ ఎరువులు అవసరం లేనే లేదు.

గ్రామీణ ప్రాంతాలలో పేద ప్రజల జీవన ప్రమాణాలు పెంచడానికి ఉద్యోగావకాశాలు కల్పించడానికి చేపల పెంపకం ఉత్తమ మార్గం. త్రిపురలో ఈ ప్రయోజనం స్పష్టంగా కన్పించింది. అక్కడ 29 శాతం ప్రజలు సంచార జాతికి చెందిన గిరిజనులు. అనాది నుంచి వారు వేట ప్రధాన వృత్తిగా జీవించే వారు. 'జలామ్' అనే పద్ధతిలో వ్యవసాయం చేసే వారు; ఇది స్థలం మార్పు చేయవలసిన వ్యవసాయం. అందువల్ల వారు తరచు ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి తరలిపోతుండే వారు. తత్ఫలితంగా వారికి ప్రభుత్వం చేపట్టే సంక్షేమ పథకాలు అందేవి కావు. అయితే ఆ రాష్ట్రంలో విస్తారంగా మిని బ్యారేజ్‌లు నిర్మించడం వల్ల, గిరిజనులు వాటి ప్రక్కన స్థిర నివాసం ఏర్పరచుకొని, చేపల పెంపకం ద్వారా ఎంతో అభివృద్ధి సాధించారు.

### చేపలు పట్టడం - చేపలు పెంచడం !

చేపల పరిశ్రమను ప్రధానంగా రెండు విభాగాలు చేయవచ్చు.చేపలు పట్టడం, చేపలు పెంచడం. చేపలు పెంచడం (ఆక్వా కల్చర్) ప్రధానంగా మూడు విధాలు. మంచినీరు, బ్రాకిష్ వాటర్, ఉప్పు నీళ్ళతో పెంపకం. మంచినీటి పెంపకంలో, వార్మ్ వాటర్ ఫిష్, కోల్డ్ వాటర్ ఫిష్ స్పోయిటేఫిషిష్ మంచినీటి రొయ్యల పెంపకం వంటివి వున్నాయి. మన దేశంలో ప్రధానంగా జరిగే పెంపకం - వార్మ్ వాటర్ ఫిష్ కల్చర్ !

### ఏ జాతి అనుకూలం?

భారతదేశంలో గండి, బొచ్చె వంటి చేపలు కామన్ కార్ప్, సిల్వర్ కార్ప్, గ్రాస్ కార్ప్, బిగ్ హెడ్ కార్ప్ వంటి జాతులకు చెందిన చేపలు విస్తారంగా పెంపకంలో వున్నాయి. అయితే వాటిలో కొన్ని మాత్రమే ఆర్థికంగా ఉపయోగపడేవి.

పెంపకానికి చేపట్టే చేపల జాతి, త్వరితంగా పెరిగే లక్షణం కలదై వుండాలి. మంచి ధర రావాలి. ప్రజలు ఆహారంగా స్వీకరించేదిగా వుండాలి. పెద్ద తల, ముళ్ళు, వెగటు వాసన, తోమడానికి కష్టం కల్గే పొలుసులు వుండేవి పెంచినా - అమ్మడం కష్టం. తక్కువ మేత తిని ఎక్కువ మాంసం సమకూర్చుకోగల చేపల జాతి రైతుకు ఉపయోగం. రైతు మేత పెట్టినా అదిపనిగా తినే చేప పనికి రాదు. దానివల్ల మేత ఖర్చు పెరగడం తప్ప చేప సైజు పెరగదు. -

కొరవ పై వారం

## చిత్రసమీక్ష

(9 పేజి కొరవ )

ఇక రెండవ కుటుంబంలో పిల్లలకు ప్రతిదానికీ విచక్షణ లేకుండా డబ్బు అందించడం. ఈ కుటుంబ పెద్దగా రావుగోపాలరావు నటించారు. ఈ కుటుంబంలోని కోడల్ని (సుమలత) అన్ని విధాలా కుటుంబ సభ్యుల్ని ఆదరించే మంచిదానిగా చూపారు. అంటే కోడళ్ళంతా కొడుకుల చెవుల్లో దూరి అదే పనిగా చెడ్డను ఊదరగొట్టే వారు కాదని చూపబడింది.

తర్వాత మూడవ కుటుంబం. బాగా డబ్బు కూడ బెట్టాలన్న ఆశతో పిసినారిగా బ్రతకటం. ఈ కుటుంబానికి పెద్దగా అల్లురామలింగయ్య నటించారు. ఇంటి నుంచి పారిపోయి వచ్చిన ఒక కుర్రవాడు (బ్రహ్మానందం) తాను జమీందారు బిడ్డనని చెప్పిమోసంతో ఈ కుటుంబంలో తిష్ట వేస్తాడు. ఆ ఇంట్లో పిల్లని ప్రేమిస్తాడు. కరువు పేస్తాడు. ఇదంతా విడ్డూరంగా కనిపిస్తుంది.

ఈ మూడు కుటుంబాలు డబ్బుకు సంబంధించిన జబ్బులతో సతమతమవుతూ వుంటాయి. ఈ కుటుంబాల్లో చూపిన డబ్బు గొడవలు గందరగోళంగా వున్నాయి.

మొత్తం మీద ఈ చిత్రం అందించిన సందేశమేమంటే ముసలి తనంలోకి ప్రవేశించిన తల్లిదండ్రులు తాము బ్రతికుండగానే తమ వద్ద వున్న డబ్బంతా కొడుకులకు కూతుళ్ళకు సమర్పించి, కొడుకులు, కోడళ్ళ నిరాదరణకు గురై చివరన అనాథలు కావద్దని.

ఈ చిత్రంలో ప్రముఖ హీరోలెవ్వరూ లేరు. ఎక్కువగా మొదట కుటుంబ సభ్యుడుగా వున్న గొల్లపూడి పాత్ర మీద ఆధారపడి చిత్రం సాగుతుంది. గొల్లపూడి, రావు గోపాలరావు, బ్రహ్మానందం, అల్లు రామలింగయ్యలను హీరోల స్థానంలో నిలబెట్టి "జాక్ పాట్" - కొట్టాలనుకున్నారు. నిర్మాత దర్శకులు. కాని వారి గ్రహపాటు వక్రించింది. ఈ నలుగురు చిత్రాన్ని దెబ్బగొట్టారు. వీరిలో గొల్లపూడి కొంత మెరుగ్గా నటించారు. రాజ్‌కుమార్, అచ్యుత్, సుమలత, మహర్షి రాఘవ, శిల్ప చిన్న పాత్రల్లో చురుగ్గా నటించారు.

**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 75.00 |
| ఆరు నెలలకు | రూ. 40.00 |
| విడి ప్రతి | రూ. 1.50 |

# అంబేత్కర్‌కు నెల్లూరు నివాళి

కాని నెల్లూరుకు ఎప్పుడు చేరిందో పోస్టు ముద్ర లేదు. మాకు మాత్రం వివాహం అయిపోయిన మరు రోజు – అంటే 13 తేది – టంచన్‌గా చేరింది. లాంచనంగా శుభాకాంక్షలు పలికే అవకాశం కూడా లేకుండా పోయింది. ఒక రూపాయి బిళ్ళ తగిలించి, కరెక్టుగా అడ్రసు వ్రాసి; జ్ఞాపకంగా ఆహ్వానం పంపిన ఫలితం ఏమిటి. హైదరాబాద్ నుండి నెల్లూరుకు ఒక కవరు చేరడానికి ఐదురోజులు పట్టాలా?

నెల్లూరు పోస్టల్ శాఖ విర్వా కానికి నవ్వాలో, ఏడవాలో చెప్పండి! సూపరింటెండెంట్లు, అసిస్టెంటు సూపరింటెండెంట్లు, ఇన్‌స్పెక్టర్లు, పోస్టుమాస్టర్లు, తక్కుంగల సిబ్బందికోటి అంతా వుంది.

వీరందరూ ఏమి చేస్తున్నట్లు? ఇటువంటి ఫిర్యాదులకు మొద్దుబారి పోయారా ? వ్రాయడానికి సిగ్గు చేటుగా వుంది!

చిన్నతనంలోనే డాక్టరుకు చూపించి చికిత్స చేయిస్తే మెల్ల లేకుండా చేయడం సులభమని, తమ బిడ్డల మెల్ల కన్ను విషయంలో తల్లిదండ్రులు వుపేక్ష చేయడం ప్రమాదమని హెచ్చరించారు. నెల్లూరు శ్రీరామమూర్తి కూడా మాట్లాడారు. కార్యదర్శి శ్రీ ఎన్.వి. రమణయ్య, ధన్యవాదాలు చెప్పారు

ఈ సందర్భంలో జ్యోతి నర్సింగ్ హోంలో కొత్తగా అమర్చిన మెల్లకన్నుకనుగొనే ఆధునిక పరికరాన్ని, కంప్యూటర్‌ను డాక్టర్ రఘురామరెడ్డి గారు చూపించారు. కార్యక్రమంలో లైన్సు డాక్టర్ జి. కొండారెడ్డి డాక్టర్ సి: ఆర్. రెడ్డి, డాక్టర్ కె. సత్యనాథ్, డాక్టర్ జయచంద్ర ప్రభృతులు పాల్గొన్నారు. బహుశా నెల్లూరులో మెల్లకంటిగ్గా అమర్చబడిన ప్రత్యేక ఆధునిక పరికరం ఇదే ననుకుంటాము.

ఆర్థికంగా బాగుపడిన వారు తమకంటె దిగువ స్థాయి వారిని విస్మరిస్తున్నట్లు పేర్కొన్నారన్నారు.

సభాధ్యక్షులు, కలెక్టరు శ్రీ రాజా మాట్లాడుతూ తాను గ్రామాలలో హరిజన వాడలను సందర్శించినప్పుడు యువకుల్లో నైరాశ్యం గోచరిస్తున్న దన్నారు. డి.కె.డబ్ల్యు కాలేజి నుండి మునిసిపల్ ఆఫీసు వరకు వున్న రోడ్డును డాక్టర్ అంబేత్కర్ రోడ్డుగా నామకరణం చేసినట్లు ప్రకటించారు.

దళితులు దీనులైనా సభమాత్రం జిగేల్ జిగేల్ మని పించింది.

## సింహపురి

(4 పేజీ కొరవ)

### దయాకర రెడ్డి సంతాప సభ

నెల్లూరు స్టాబోర్డ్సు అధిపతి దివంగత తిక్కవరపు దయాకర రెడ్డి గారి సంస్మరణ సభ 10 తేది ఫ్యాక్టరీ ఆవరణంలో జరిగింది. వేదపారాయణం, బైబిల్, ఖురాన్ పఠనాలతో ప్రారంభమైన సభలో శాసనసభ్యుడు జె.కె. రెడ్డి, మాజీ మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి కార్మిక నాయకుడు యల్.వి. కృష్ణారెడ్డి, జర్నలిస్టు నలమోలు గోపాల కృష్ణయ్య, కెంచం పురుషోత్తమ రావు, స్టాబోర్డు మేనేజరు శివరామయ్య గారలు దయాకర రెడ్డిని నెల్లూరు జిల్లా పారిశ్రామికీ · కరణకు నాంది పలికిన ప్రథమ పారిశ్రామిక వేత్తగా పేర్కొంటూ శ్రద్ధాంజలి ఘటించారు.

దయాకర రెడ్డి రూపపటానికి పూలమాల వేసి శ్రీ ఆనం వెంకట రెడ్డి నివాళులర్పించారు.

సభకు ముందు దయాకర రెడ్డి గారి అస్థికలు పవిత్ర పెన్నా నదిలో నిమజ్జనం గావించబడ్డాయి.

### అంబేత్కర్ జయంతి – ఘాటు ఘాటు ప్రసంగాలు

14 తేది భారత రాజ్యాంగ నిర్మాతలలో మూలపురుషుడు, దళిత జనోద్ధారకుడు డాక్టర్ బి.ఆర్. అంబేత్కర్ 101 వ జయంతి సభ టవున్‌హాల్‌లో జరిగింది. కలెక్టరు శ్రీ కె. రాజా అధ్యక్షించారు. సభకు ముందు దర్గామిట్టలో అంబేద్కర్ భవనం నుండి అత్యంత క్రమ పద్ధతిలో ప్రారంభమైన పెద్ద వూరేగింపు సభాస్థలి చేరింది. ఇది డాక్టర్ అంబేత్కర్ శత జయంతి ముగింపు సభగా. 101 వ జన్మదినోత్సవ సభగా వుంటుంది!

14 తేది నెల్లూరు డాక్టర్ అంబేత్కర్ జయంతి సభలో వుపన్యసిస్తున్న కలెక్టరు కె. రాజా. వేదిక మీద ఓరేపల్లి సుబ్బయ్య, స్వర్ణవేమయ్య, రత్నాజోసఫ్, రవీంద్రనాథ్ వున్నారు.

ఉపన్యాసాలు గరంగరంగా ఘాటు ఘాటు గానే సాగాయి. డి.కె. డబ్ల్యు కాలేజి లెక్చరర్ డాక్టర్ రవీంద్రనాథ్ దళితుల కోసం అంబేత్కర్ సాగించిన వుద్యమం ఫ్రెంచి, రష్యా విప్లవాలకు తీసిపోనిదని వెలిబుచ్చారు. దళితులకు ఆర్థిక స్వాతంత్ర్యం వస్తే సమాజంలో వారికి సముచిత స్థానం వస్తుందని కమ్యూనిస్టుల సిద్ధాంతం తప్పుడు సిద్ధాంతమని వాక్రుచ్చారు. కావలి జవహర్ భారతి వైస్ ప్రిన్సిపాల్ శ్రీ రత్నాజోసఫ్ ఎప్పుడు ఫైర్ బ్రాండే – కోటీశ్వరుడైన జగ్జీవన్ రాం భారత ప్రధాని కాలేక భంగపడడానికి కారణం భారత రాజకీయాలలో ప్రేళ్లూనిన కుల తత్వమే కారణమన్నారు ఆయన. పార్లమెంటు మాజీ స్పీకరు శ్రీ రబిరే వ్రాసిన ఒక పుస్తకంలో దళితులలో

### ఊర్వశి గ్రంథావిష్కరణ

శ్రీ పచ్చిపులుసు వెంకటేశ్వర్లు రచించిన 'ఊర్వశి' గ్రంథావిష్కరణ సభ 5 తేది టౌన్ హాల్ రీడింగ్ రూంలో జరిగింది. శ్రీ దుగ్గిశెట్టి వెంకటరమణయ్య ఆవిష్కరించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షించారు. రవీంద్రనాథ్ టాగూర్ ఊర్వశిని గూర్చి వెలిబుచ్చిన తాత్వికతను ఉద్రేక స్వరంతో వివరించారాయన. శ్రీ ఎస్వీ భుజంగరాయ శర్మ, శ్రీ మతి కాకుటూరు వసుంధర

### లయన్స్ మెల్లకంటి ఉచితశిబిరం

లైన్స్‌క్లబ్ వారు ఇటీవల ఉచిత వైద్యశిబిరాలు, బైట ప్రదేశాల నుండి నిపుణులను రప్పించి, చురుగ్గా జరుపుతున్నారు.

ఆ మధ్య డాక్టర్ జి. కొండారెడ్డి సారధ్యంలో భారీ ఎత్తున దంత వైద్య శిబిరం జరిగింది. టవున్‌లోని డెంటిస్టులందరూ చేతులు కలిపి నిర్వహించారు. హైదరాబాదు దంత కళాశాల ప్రిన్సిపాల్ తదితర అనుభవజ్ఞులైన డాక్టర్లతో పరీక్షలు చికిత్సలు జరిపించారు. తర్వాత డాక్టర్ కె. సత్యనాథ్ సారథ్యంలో హృద్రోగ చికిత్సా శిబిరం నిర్వహించబడింది. మద్రాసు అపోలో హాస్పిటల్ హృద్రోగ నిపుణుడు డాక్టర్ సత్యమూర్తి గారు రోగులను చూచి పరీక్షలు, సలహాలు, చికిత్సలు జరిపారు. పై రెండు శిబిరాలకు రోగులు ఎక్కువ సంఖ్యలో రావడం విశేషం.

12 తేది క్లబ్ అధ్యక్షుడు, నేత్ర వైద్యుడు అయిన డాక్టర్ పి. రఘురామరెడ్డి తన జ్యోతి నర్సింగ్ హోం ప్రాంగణంలోని మెల్లకన్ను ఉచిత శిబిరం నిర్వహించారు. దీనికి వంద మంది రావడం పెద్ద సంఖ్యేనన్నారు మగ వారి కంటే ఆడ వారే ఎక్కువగా కనపడ్డారు; స్త్రీలలో యువతుల సంఖ్య తక్కువ కాదు. హైదరాబాదు సరోజినీ దేవి కంటి ఆస్పత్రి డిప్యూటీ సూపరింటెండెంటు డాక్టర్ ఎన్. సుబ్రహ్మణ్య రెడ్డి రోగులను పరీక్షించి, మెల్లకన్ను ఏ దశలో వున్నదీ నిర్ధారించి సలహాలు మందులు ఇచ్చారు.

శిబిరం ప్రారంభానికి ముందు, చిన్న సభ, డాక్టర్ రఘురామ రెడ్డి గారు స్వాగతిస్తూ, మెల్లకన్ను వల్ల కలుగు చేటులను అవగాహన చేసికొని నివారణకు తల్లిదండ్రులు తీసుకోవలసిన జాగ్రత్తలను గూర్చి వివరించారు. డాక్టర్ సుబ్రహ్మణ్య రెడ్డి గారు తన ప్రసంగంలో మెల్లకన్ను అదృష్ట చిహ్నమనే మూఢ నమ్మకం ఒకటుందని, అది పొరపాటని, మెల్ల వల్ల చూపు తగ్గిపోతుందని,

గ్రంథ సమీక్ష జరిపారు. ఎమెస్కో ప్రచురణ కర్త శ్రీ దూపాటి విజయకుమార్, ఈ గ్రంథ విశిష్టతను గమనించే లాభాపేక్ష లేకుండా ప్రచురణ చేపట్టామని చెప్పారు. శ్రీ మతి లల్లాదేవి మాట్లాడారు.

### కొత్త గా పది టౌన్ బస్సులు.

మార్చి 30 తేది కలెక్టరు శ్రీ రాజా అధ్యక్షతన జరిగిన ఆర్.టి.ఒ. సమావేశంలో నూట ముప్పై ఏడు రూట్లకు ప్రైవేటు బస్ ఓనర్ల నుండి వచ్చిన దరఖాస్తులు రోడ్డు రవాణా సంస్థ ఆక్షేపణ మేరకు తిరస్కరించబడ్డాయి. రోడ్డు రవాణా సంస్థ టవున్ రూట్లు నిర్వహించకున్నా, మున్సిపల్ హద్దులలో ప్రజావసరాన్ని బట్టి ప్రస్తుతం బస్సులు తిరుగని పది రూట్లు మంజూరు చేయబడ్డాయి.

టవున్‌లో మాత్రం ప్రైవేటు బస్‌లు ఎందుకు తిరిగాలి? అన్ని రూట్లలో ఆర్.టి.సి. ఏ ఎందుకు బస్‌లు నడపకూడదు?

### యల్.ఐ.సి. కోటీశ్వరుడు

యల్.ఐ.సి. ఏజెంటు శ్రీ యం. వి. కృష్ణయ్య 1991 - 92 ఆర్థిక సంవత్సరాలలో 268 పాలసీలతో ఒక కోటి ఒక లక్ష ఇరవై ఎనిమిది వేల రూపాయల నూతన వ్యాపారం పూర్తి చేసి నెల్లూరు దర్గామిట్ట బ్రాంచి చరిత్రలో చరిత్ర సృష్టించాడని బ్రాంచి మేనేజరు శ్రీ ఆర్.మునిరత్నం ప్రకటించారు.

కృష్ణయ్య గారు యల్.ఐ.సి.కి కోటి రూపాయల వ్యాపారం చేసి పెట్టారు గాని తాను కోటీశ్వరుడు కాలేదు. అందువల్ల ఆయన్ను కోటీశ్వరుడని కాకుండా క్రోరోపతి అని మాత్రం పిల్లుద్దాం. ఆయన వ్యాపార ప్రతిభను అభినం దిద్దాం.

### తమిళ సంక్షేమ సంఘం

నెల్లూరు అన్నా తమిళుల సంఘం, ఆంధ్రులు – తమిళుల సంఘ సమావేశం శ్రీ ఐ.యస్. వెంకటాచలం అయ్యర్ (కోమల విలాస్) అధ్యక్షతన జరిగి ఈ క్రింది వారిని కార్యవర్గంగా ఎన్నుకున్నారు.

అల్లాడి వాసుదేవన్ – అధ్యక్షుడు. టి. మునిరత్నం ఐ.ఏ.యస్. గౌరవాధ్యక్షుడు. పి. వెంకటేశ్వర్లు – సెక్రటరీ. ఎ. చంద్రబోస్. ఎ. వేణుగోపాల్ – ఉపాధ్యక్షులు, ఏ.కృష్ణన్ – సంయుక్త కార్యదర్శి. పి. బాబు – కోశాధికారి.

వీళ్ళందరూ తమిళ – తెలుగు ఉభయ మిత్రులన్నమాట; భాషా ద్వేష రాహిత్యానికి చిహ్నాలన్నమాట.



I, BULLA PRABHAKAR REDDY, son of Janakirami Reddy B.E., Assistant Engineer Shall hence forth be known as BURLA PRABHAKAR REDDY.

### In the Court of the Sub-ordinate Judge, Nellore

I.P. No. 3/91

Innamuri Veeranjaneya Rao - Petitioner

Vs

1. Somisetty Financiers & others - Respondents

శ్రీనాథ్ అండ్ కంపెనీ
36, గోడౌన్ స్ట్రీట్
మద్రాసు – 1

యం. శివకుమార్ రెడ్డి
మహాలక్ష్మి దేవాలయము ఎదురుగా
వాకలి వీధి, నెల్లూరు – అను వారికి

**నోటీసు**

పై నంబరు దావా 24-6-92 తేదికి ప్రతివాదులైన మీకు నోటీసు నిమిత్తమై వాయిదా వేయబడి యున్నది. కాబట్టి ఆ రోజున మీరు పగలు 10 గంటలకు పై కోర్టులో హజరై మీకు ఆక్షేపణలున్న యెడల తెలుపుకో వలసింది. లేకున్న మీ పరోక్షమందు తీర్మానించబడును.

పిడూరు నాగేశ్వరరావు
వాది తరపున అడ్వకేటు

### In the court of District Munsif - Penukonda

E.P. No. 13/91 in O.S. 26/91

బుర్ర వెంకట రాయుడు -DHr
ముస్త్రా చిన్నకొండప్ప - JDr

**నోటీసు**

ఇందుమూలముగా తెలియజేయ డమేమనగా ప్రతివాది (JDr)కి చెందిన షెడ్యూలు దాఖలా ఆస్తి వాది (DHr) మొత్తము రాబట్టుకొను 15.6.92 తేదులు పెనుకొండ డి. మునసబ్ గారి కోర్టులో వేలం వేయబడను. వేలంలో పాల్గొనదలచిన వారు పై తేదీలు అనగా 15.6.92 పగలు 10.30 గంటలకు పై కోర్టు ఎదుట హాజరయి వేలంలో పాల్గొన వచ్చును.

**షెడ్యూలు**

Property situated in Nagi Reddy Palli Village land limits within the S.R.D. of Bukkapatnam and R.D. of Ananthapur.

| Babu | S.No. | Extent | Phr Value | Amin Value |
|---|---|---|---|---|
| G.Wet<br>G. Wet | 248-1<br>101-5 | 0-29<br>0-38 | 5000/- | 2000/-<br>2000/- |
| | | 0-67 | | |

Propy situated in gragalapalli village land limits within the S.R.D of Bukkaptnam and R.D. of Anantapur.

| Babu | S.No. | Extent | DHr Value | Amin Value |
|---|---|---|---|---|
| G.Dry | 84-3 | 3-45 out of 6-90 | 10,000 | 20,700 |
| | | 0-67 | | |

B.Venkata Ramana Rao
Advocate for DHR

# రాజీవ్‌లేని లోటు బాగా కన్పించింది!

మినరల్ వాటర్ బాటిల్స్ భోజనంలో స్వీటు. వెజిటబుల్ పలావు. స్పెషల్ వంటకాలు. ఉదయం టిఫిన్, మధ్యాహ్నం భోజనం, సాయంత్రం మళ్ళీ టిఫిన్ రాత్రికి డిన్నర్. కేంద్ర మంత్రులతో సహా ఏ స్థాయి

> **తిరుపతి ప్లీనరీ**
> (మొదటి పేజీ కొరవ)

నాయకుడూ భోజనానికి బయట హోటళ్లకు వెళ్ళ లేదు. పివికూడా ఒక పూట అక్కడే భోంచేశారు. మన్మోహన్ సింగ్ గారైతే చక్కెర కేళి అరటి పళ్ళను చూసి ఐసై పోయారు! ఒక పూట భోజనం మాని ఆ అరటి పండ్లు తిన్నారాయన.

సాధారణంగా పత్రికల వారికి అసంతృప్తి ఎక్కువ. అటువంటిది 750 మంది రిపోర్టర్లు హాజరైన ఈ ప్లీనరీలో ప్రెస్ నుంచి స్వల్ప విరసన సైతం ఎదురు కాలేదు. వార్తలు పంపుకోవడానికి, భోజనాదివసతులకు

### కౌన్ హైఏ పగలా?

వర్కింగ్ కమిటీ సభ్యత్వం కోసం ప్రధాని కుమారుడు శ్రీ పివి రంగారావు సమావేశ మందిరంలో తిరుగుతుంటే. అతనెవరో తెలియని ఉత్తర భారత ప్రతినిధులు 'కౌన్ హై ఏ పగలా' అని హేళన చేశారు. రంగారావు గారికి నామినేషన్ పై సంతకం పెట్టే వారే దొరక లేదు చాలా సేపు.

---

చేసిన ఏర్పాట్లు వారిని పూర్తిగా సంతృప్తి పరచాయి.

ఎగ్జిబిషన్ పెట్టాలనే ఆలోచన ఎందుకు వచ్చిందో కాని, అది స్వామి కార్యం, స్వకార్యం రెండింటినీ నెరవేర్చింది. దాదాపు కోటి 50 లక్షలు వసూలైంది అంగళ్ళ బాడుగల క్రింద; రాజీవ్ నగర్ సందర్శనార్థం వచ్చిన ప్రజలు పోలీసుల లాఠీలకు గురి కాకుండా గంట, రెండు గంటలు ప్రాంగణంలో తిరుగాడే అవకాశం కల్పించింది. ఎగ్జిబిషన్ లేకుంటే సందర్శకులంతా ప్లీనరీ హాలు దగ్గర చేరి ఇబ్బంది పెట్టివుండే వారు. ప్రధాని శ్రీ పివి కూడా 15 తేది ఒక గంట పాటు ఓపికగా ఎగ్జిబిషన్

### పుల్లాకు లెత్తే కమిటీలో శీనయ్య

మాజీమంత్రి నల్లపరెడ్డి శ్రీనివాసుల రెడ్డిని ఎఐసిసి ప్రతినిధులు తిన్న ఎంగిలి విస్తర్లు ఎత్తే కమిటీలో నియమించారా? ప్లీనరీ ప్రాంగణం లోని ఏ పుల్లాకుల కేంద్రం లోను ఆయనైనేకన్పడలేదు కాని, పత్రికల వారితో మాత్రం తనకు ఆ కమిటీలో సభ్యత్వం లభించినట్లు ప్రకటించారు.

జనార్దనరెడ్డి పై అక్కసు శ్రీనివాసులు రెడ్డి గారిని ఎంతగా పతనం చేస్తున్నదో చూడండి!

---

తిలకించారు.

ఈ సమావేశాలు ఇటు పివికి, అటు జనార్ధన రెడ్డికి న్యూట్రాముల్ త్రాగినంత బలం సమకూర్చి పెట్టాయి. పార్టీలో తన పెత్తనాన్ని, పలుకుబడిని తిరుగులేని రీతిలో రుజావుచేసుకున్నారు ప్రధాని. ఆర్థిక, విదేశాంగ విధానాలలో ఆయన తీసుక వస్తున్న సంస్కరణలు,

### రిగ్గింగ్ చేస్తే ముఖ్యమంత్రిత్వం

ఎఐసిసి వర్కింగ్ కమిటీ ఎన్నికల్లో రిగ్గింగ్ చేస్తే, మేమందరం కలసి నిన్ను ముఖ్యమంత్రిని చేస్తాం మామా అని శ్రీ మాదాల జానకిరాం, మంత్రి దివాకర రెడ్డితో పందెం కాశారు. మాట మీద నిలబడితే నా సత్తా చూపిస్తానని దివాకర రెడ్డి ప్రతినబూని, పంచె బిగట్టి, పోలింగ బూత్ దగ్గరకు వెళ్లాడు కాని – ఎర్ర టోపీల పోలీసుల దగ్గర వేసే వేషాలు మా దగ్గర చెల్లవన్నట్లు నల్లపిల్లుల కమెండోలు మెషిన్ గన్‌లు చూపి గుర్రు మనడంతో, చల్లగా వెనుదిరిగి వచ్చేశాడు దివాకర రెడ్డి! పందెం వీగిపోయింది.

---

చేపడుతున్న చర్యలకు సమావేశాలు పూర్తి మద్దతు ప్రకటించినట్లయింది. ఇది వరకటి వలె ప్రభుత్వ నిర్ణయాలపై ఇకముందు పార్టీ నాయకులు విమర్శలు చేయలేరు. ముఖ్యంగా ఆర్థిక

### ఎసి పేరుతో గేటు

మంత్రి శ్రీ మాదాల జానకిరాం స్వర్గీయ ఏసి సుబ్బారెడ్డి పేరుతో ఒక స్వాగత ద్వారం నిర్మించారు. తిరుపతి టౌన్ మొదట్లోనే – ఓవర్ బ్రిడ్జి దగ్గర – ఈ ద్వారం కట్టడంతో అన్నిటికి ఇది చూపరుల దృష్టిలో ఎక్కువగా పడింది.

---

సంస్కరణల కొనసాగింపుకు పివికి, మన్మోహన్ సింగ్‌కు గ్రీన్ సిగ్నల్ లభించింది. పార్టీ సర్వసభ్య సమావేశం ఆమోదం పొందిన విధానాలను ఎవరు అభ్యంతర పెట్ట గలరు? పార్టీలోని ఇతర నాయకు లందరి కంటె తనది ఉన్నత స్థానమని రుజువు చేసుకున్నారు ప్రధాని.

జనార్దన రెడ్డిని రాష్ట్రస్థాయి నుంచి జాతీయ స్థాయి నాయకత్వానికి పెంచాయి సభలు. కేంద్ర నాయకు లందరికీ తన కార్యదక్షతను, సమర్థత ను సగర్వంగా ప్రదర్శించారు ముఖ్య మంత్రి. అది ఆయనకు రాష్ట్రంలోనూ



ట్రాఫిక్ రక్షణలో నిమగ్నులై వున్న అశ్వికదళం

తిరుగులేని బలం సమకూరుస్తుంది. కనీసం ఏడాది పాటు అసమ్మతీయులు నోరుతెరచి మాట్లాడే అవకాశం వుండదు. ఢిల్లీ స్థాయిలో జరిగే చర్చలు, నిర్ణయాలలో పాలుపంచుకొనే అవకాశం లభిస్తుంది.

జనార్దన రెడ్డి కార్యశూరుడే కాని, మంచి వక్త కాకపోవడం వల్ల వివిధ రాష్ట్రాల నుంచి వచ్చిన నాయకులను, ప్రతినిధులను ప్రభావితం చేయలేకపోయారు. మూడు రోజుల సభలలో ఆయన మాట్లాడింది ఒకే ఒకసారి అదీ ప్లీనరీ నుద్దేశించి చేసే ప్రసంగం స్థాయిలో లేదు. అటువంటి కీలక సమావేశాలలో రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలు విధానాలపై ప్రసంగం చేయడం సముచితం. ఎన్టీఆర్‌ను తిట్టడానికి, గర్భిణీ స్త్రీలకు చేసే సహాయాల వివరించడానికి అది వేదిక కాదు. పివి, మణిశంకర అయ్యర్, వసంత సాఠే వంటి వారి ఉపన్యాసాలకు. ముఖ్యమంత్రి ప్రసంగానికి సామ్యమే లేదు. జీతాలు భోంచేయడానికి, సౌకర్యాల ననుభవించడానికి తప్ప, ఎందుకూ కొరగాని ప్రెస్ కార్యదర్శుల వైఫల్యం ఇది!

ప్లీనరీలో సందడి చేసి, ముఖ్యమంత్రికి వ్యతిరేక వాతావరణం సృష్టించడానికి అసమ్మతీయులు చేసిన ప్రయత్నాలు వ్యర్థమై పోయాయి. హనుమంతు, వైఎస్. వంటి వారు

[illegible] 7 పేజీలో



అన్నమాచార్య విగ్రహావిష్కరణ చేస్తున్న ప్రధాని : ప్రక్కన టిటిడి చైర్మన్ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి











Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara Books Pvt. Ltd. Nellore.